# స్వప్నసుందరి

# [Dream Girl]


రచయిత:

శ్రీ కె. వి. అప్పలాచార్య

యల్. ఐ. యమ్.

(మెడికో) మునగాను





పబ్లిషర్;

కందుల గోవిందం

జనరల్ బుక్ డిపో, రాజమండ్రి

ఇ. జి. 59. 1946 ఫిబ్రవరి





(వెల 0—8—0)

# సూచన

"పుట్టిననాడే - గండము పట్టిననాడే"

కవిత్వం వస్తుందా యని నామిత్రుడు నన్ను ప్రశ్నించాడు—

కాని! నేటి నవలారచనవిషయంలో మనకంటికి అగుపడేవివిధ సంఘటనలను చాకచక్యంతోనూ, హాస్యంగాను వ్రాస్తే అదే కవిత్వం అవుతుంది.

నేటికవులవిషయంలో ఇది బాగాస్ఫురిస్తుంది దూరదృష్టితో చూస్తే—ఆవిధంగా మోహనబాబు అనే ఆధునికకవి తను వ్రాయ బోయే నవలకి ప్లాటూ దొరకనివిషయంలో...

ఒకనాటిరాత్రి తనకుకలిగిన స్వప్నసుందరిలోని వివిధవింత ఘట్టాల్ని, చాకచక్యంతో పర్చి కూర్చి "డ్రీంగర్ల్ అనే స్వప్నసుందరి" అనేనవలగా వ్రాసి, భార్యఅయిన రాధసహాయంతో, పాఠకలోకానికి గోవిందయ్య అనే పబ్లిషర్ ద్వారా అందిస్తాడు.

కథ బాగుందీ లేనిదీ నిర్ణయించే బాధ్యత పాఠకులది—

ఆవిధంగా నేటిప్రపంచపరిస్థితులను, దుస్థితులను వీలున్నంత వరకు బయటపెట్టి ప్రపంచంలో శాంతినెలకొల్పాలనే నాఉద్దేశ్యం—

దీనికి మీారందరిసహకారం కూడా ఉండాలి కదూ!—

ఇక నవలచదవండి !!!

కలవ్,
శ్రీ ఆచార్య.

# అంకితం

నిరంతరం నామనోవీధుల్లో సంచరిస్తూ!
నా నామస్మరణమే సదాజపిస్తూ—నా పరిణయరథాన్ని
పరిణయవీధుల్లో సంచరించేలా సారథ్యం చేస్తున్న
నా సహభాగిని శ్రీమతి అలివేలుకు ప్రేమతో !!!

౧

"ఏలనె తుమ్మెదా, ఎలుగెత్తి పాడవేమే!
ఏలనె......?
పడకటింటి, ప్రియురాలు పాడ
పసందైనపాట మాటలను
పాడవేమే— —?
ఏలనె ???"

అంటూ మోహనరావు ఆనందంగా ఈలపాట పాడుకొంటూ ఇంట్లోకి వచ్చాడు.

అతనిపాటవిని, ఎదురుచూస్తూన్న రాధ వెంటనే బయటకు వచ్చింది. మోహన్ మోములో మలయమారుతాల్లా మందహాస వీచికలు వీస్తున్నాయి- రాధ అతనుపొందే ఆనందాన్ని గుర్తించింది- కాని......?

మోహన్ చేతిలోయున్న బెనారస్ సిల్కుచీర తనకే తేబడిందని తెలుసుకొన్నా అప్రయత్నంగా ఆమె లేతపెదవులమీద చిరునవ్వులు తాండవించాయి.

'విశేషం ఏమిటండోయ్ కవిగారూ? ఇవాళ మీ వ్యాపారం మూడుపువ్వులూ ఆరుకాయలుగాయుంది——!"

'అవును రాధా! నీవంటి పవిత్రప్రేమమూర్తి భార్యగాయుంటే నాజీవిత కుసుమాలు ఎల్లప్పుడూ వికశించే యుంటాయి- నాజీవిత రథము వన్నెయ వీధుల్లో వచార్లు చేస్తూనేయుంటుంది-" అంటూ ఆమెను దగ్గరగా తీసుకొంటాడు.

'ఆఁ! మీరు వ్రాసిన 'రెండే ముద్దులు' అన్ననవల పబ్లిషర్ కు ఇచ్చేసారా?"

"అదొక్కటేగాదు- తర్వాత ఇంకా అరడజను నవలలువ్రాసి ఇవ్వడానికి అగ్రిమెంటు వ్రాయించాను—

"అదీ సంగతి- అందుకే ఇంతఉషార్! ఎంతగిట్టిందేం కవికుమార్ గారూ?"

"అబ్బె! ఎంతోనా రాధా- రెండే ముద్దులనే నవలకి పాతిక రూపాయలు- మున్ముందు వ్రాయబోయేవాటికి అడ్వాన్సుగా వంద రూపాయలు పుచ్చుకొన్నాను.

మొత్తం నూటపాతిక చేతికి అందింది ఇవాళ!"

"మరయితే ఈచీర ఎందుకు కొన్నారు!

"కొనాలని ప్రియత్న పూర్వకంగా కొనలేదు- వస్తోండే తోవలో కొత్త రకంగా కనబడింది. నాకూ నచ్చిందిగాబట్టి కొనేశాను.'

"ఖరీదు ఎంతపెట్టారు!"

'ఎంతోనా! అరవైరూపాయలు (యుద్ధానికి పూర్వంలెండి)"

"అనవసరంగా కొన్నారండి? బోలెడన్ని చీరలున్నాయి పెట్టెలో! ఎప్పుడూ కొత్తరకం అంటూ నాకే కొంటారు గాని, మీ రెన్నడయినా నూట్లుకట్టించుకొన్నారా? మగవారు కట్టుకోవడానికి కొత్తరకాలు రాకనా? చెప్పండి—!'

'రాధా! ఇదంతా నీసంతోషానికి కాకబోతే మరెందుకు చెప్పు! నువ్వు నా- స్వ- సుం- ద- రి- వి! నాఆశలు, ఆశయాలు నెరవేర్చే సుకుమారివి! నీసంతోషమే నాసంతోషము- నాకు ఏసూట్లూ, బూట్లూ అక్కరలేదు- ఇలా సామాన్యంగాయుంటే చాలు- అంటూ మరింత కౌగలిలోనికి రాధను తీసుకొని—

'రాధా! ఒక్కసారి కట్టుకొనిరా!ఎలాయుంటుందో చూద్దాం- అంటూ చీరను అందిస్తాడు మోహన్...

మోహన్ అంత పెద్దచదువు చదవకపోయినా, స్కూలుఫైనలు వరకు చదివి, మూడేళ్ళు వెలగబెట్టి, అంతటితో చదువుకు తిలో

దశాలు ఇచ్చియుండబట్టి, ఆతని తండ్రి మోహన్‌కు పెళ్ళిచేసేసాడు-
విద్యార్థిజీవితంలోనే చిన్ని చిన్ని వ్యాసాలు వ్రాస్తూ పత్రికల కుపంపుతూ యుండేవాడు- స్కూలులో జరిగే ప్రతీ డిబేటింగ్ మీటింగులలోనూ పాల్గొంటూ ఉపన్యాసాలు ఇస్తూయుండేవారు- ఆవిధంగా సరస్వతీ కటాక్షంవల్ల, స్కూలుఫైనలు ప్యాసుకాకపోయినా, మోహన్ ఒకకవికుమారుడు అనిపించుకొన్నాడు— రానురానుచిన్న చిన్న నవలలుగూడా వ్రాస్తూ, ఇప్పుడో పెద్దగ్రంథకర్త అయ్యాడు.

రాధ అప్పుడే తెచ్చిఇచ్చిన బెనారసుసిల్కు-చీరను ధరించి రతీదేవిలాగ తయారుఅయ్యి వచ్చింది మోహన్‌వద్దకు— వెంటనే ఆనందాన్ని, ఆమెనుచూసి పొందిన ఆహ్లాదాన్ని, ఆమెలోయుండి పైకి ఉబికి తన్మయంచెందించే సహజసౌందర్యాన్ని చూసి, ఆమెను బాహుపంజరంలో ఇమిడ్చి ముద్దులవర్షం కురిపించేశాడు ఆమె పెదిమలమీద- అబ్బ! ఒకటా— రెండా! లక్షలకొలది అమృతంవోలికేముద్దులు లేత గులాబీమొగ్గలమీద వర్షించాయి—

"చాలాబాగుందికదూ?"—తృప్తిపడుతూ అడిగింది రాధ—

"అబ్బ! నాఊహకు— బావకుకూడా అందటంలేదు ఇప్పటి నీఅందచందాలు!"—అంటూ చీరనలిగిపోతుందేమోయనే భయంచేత ఆమెను కౌగిలినుండి విడదీసి...!

"మిగిలిన అరవయి అయిదురూపాయలు ఇవిగో!'— అంటూ రాధచేతుల్లో పోసాడు ఆడబ్బు—

"నాకెందుకూ? మీరు క్రొత్తదుస్తులు కుట్టించుకోండి! పండగలు వస్తున్నాయిగా!"—అంది రాధ ఆడబ్బును మోహన్ జేబులో తిరిగిపెడుతూ—

"సరేలే—' అంటూ- ఆసొమ్మును భద్రపరచుకున్నాడు—

"రాధా! అగ్రిమెంటు వ్రాయించానన్నమాటేగాని, అరడజను నవలలు ఎప్పుడువ్రాయడం అనేసందేహం పీక్కుతింటోంది–అవలు నరుకు ఏముందివ్రాయడానికి? అంతాచెత్త ఇరికించాలి– అంతేగా"

"ఏం? మునుపువ్రాసినవి ప్రచురితంకాకుండా ఇంకా ఉన్నాయిగదండీ!"

"అవును- మరచిపోయానురాధా! ఓసారి అల్ఖితనవలలుఅన్నీ ఇలా తీసుకురా!"

అని మోహస్ అనగానే రాధ నవలలప్రతులు తెచ్చింది–

"ఎన్నివ్రాశియుంచానురాధా!"

"అయిదు"

"పేర్లుచదువు ఒక్కసారి–వెధవనవలలు , ఎన్నివ్రాశానో— ఎన్నిప్రింటుఅయ్యాయోకూడా జ్ఞాపకంలేదు. ఒకసారి ఆపేర్లుచదువు!"

'ఫ్రీలవ్—హంతకుడు—దేఖో—బొమ్మ—బొరుసు—'

"అయితేసరే! ఇంకోటి వ్రాసిపారేస్తే పీడవదిలిపోతుంది— రాధా! ఇంకేమైనా హెడ్డింగులుపెట్టానా?"

"ఆఁ. ఒకటిమాత్రంయుంది–

"ఏమిటదిరాధా?"

'స్వప్నసుందరి (డ్రీమ్ గర్ల్)'

"ఆఁ! ఇప్పుడుజ్ఞాపకంవచ్చిందిరాధా!' అంటూ నవ్వుతాడు.

"ఏం? అలా వెర్రిగా నవ్వుతావెందుకూ!'–

"మనజీవితగాధనే ఆకథలో వ్రాదామనుకొంటున్నా–"

'అందుకేనా నన్ను స్వప్నరాణీ అని పిలుస్తారు!'–అంటూ రాధ ఆతనిబుగ్గలను సాగదీస్తూ వయ్యారంగా అడిగింది—

'వ్రాస్తేనేంచెప్పు! అదీ ఒకటోరకమైన కథేగా'

"కవులకు యదార్థవిషయాం వర్ణించడం కష్టంకదూ!"

'ఆమాటనిజమే!"

'కల్పనలుకథలు వ్రాయమంటే కలం చకచకా నడుస్తుందని మీారేగాచెప్పింది- మరి ఈకవికుమార్ గారు ఎలావ్రాస్తారోచూడాలి.

'ప్రియతిన్ని స్తానురాధా! బజారునవలలు మాదిరి ఎన్నడూ వ్రాయననుకో—సాధ్యమైనంతవరకు పాఠకుల హృదయాలను రంజింప చేయటానికే చూస్తాను—

రాధా! నువ్వునాకు భలే డ్రీంగర్ల్‌గా దొరికావు— అందుకే కవులకు ప్రియురాలవల్ల పేరు వస్తుందంటారుకదూ ?? ?"

అంటూ రాధను ముద్దిడుకొని కౌగిలిలో అదిమిపట్టుకున్నాడు-

అలా ఎంతసేపున్నారో ?

---

౨

నెలాఖరుకు మోహన్ అరడజను నవలలు పబ్లిషర్‌కు అంది వ్వాలి-తనువ్రాయబోయేనవలకి స్వ- ప్న- సుం- ద- రి-యనిముందే నామకరణం చేశాడు—

అతను నవలవ్రాయకముందే పాఠకుల దృక్పధంలో అతనిజీ విత గాథ సినీమారీలులాగ త్రిప్పిచూపటం నావంతు- ప్రతీవారి జీవి తాలూ విశాల దృష్టితో పరిశీలిస్తే ఒక చలనచిత్రంలాగే కనుప స్తుంది- కాదంటారా?

మీాతో వాదోపవాదాలు అనవసరంగాబట్టి అసలు విషయా యానికి వద్దాము—

అవి మోహన్ చిన్నప్పటిరోజులు!

మోహనబాబు జననంతో తల్లి స్వర్గస్థురాలైయింది- ఆకార్య

ణంచేత అతిగారాబంగా పెరిగాడు- అదీగాక వాళ్ళొక్కరి విషయం లో ఆవిధంగా అతిగారాబంగా పెంపబడినవారు పైకి రారనేవిషయం గోచరిస్తుంది.

లోకజ్ఞానం, ప్రపంచపరిస్థితులు తెలిసినంతవఱ్కు మోహన్ అమ్మమ్మగారివద్ద పెంచబడ్డాడు. ఆతనిదురదృష్టం కొలదీ ఆమెకూడా దూరమైపోయింది- ఇంక మిగిలింది అతండ్రికొడుకు లిద్దరే!

మోహన్ బాబు స్కూలు పైనలు క్లాసులోకి వచ్చాడు- బుర్ర గట్టిదేగాని, చదువులో ఫలించలేదు- లోకవిషయాలలో ఆబుగ్రి అమోఘంగా వినియోగింపబడేది.

ఒకరోజున స్కూలులో డిబేటింగు మీటింగు పెట్టారు—" ప్రేమించి పెళ్ళిచేసుకోవడమా? పెళ్లిచేసుకొని ప్రేమించడమా? లాభనష్టాలు—" అనే విషయం గురించి ఆనాటి మీటింగులో చర్చించారు- కొంతమంది విద్యార్థులు, విద్యార్థినులు వారివారి అభిప్రాయాలను వెల్లడిచేస్తూ, చాలామంది, 'ప్రేమించిపెళ్ళి' అనేవిషయాన్నే బలపరుచుకొంటూ వచ్చారు-మోహన్ సభను అలంకరించి చర్చించడము మొదలు పెట్టాడు-

'సోదరుల్లారా! సోదరీమణులారా!

నేడు మనం చర్చించబోయే విషయం పెద్దసమస్య అనక తప్పదు— తోటివిద్యార్థులు, విద్యార్థినులంతా తప్పుత్రోవనే చర్చించారని నాఅభిప్రాయము.

కారణ ఏమంటే, అసలు ప్రేమంటే (లావ్) ఏమిటి? ప్రేమ ఎందుకు కలగాలి? ఎవరికి ఎవరిమీద ప్రేమయుంటుంది? ప్రేమ ఎన్ని విధాలు? అనే ఈవిషయాలు ముందు తెల్సుకోవాలి-

ప్రేమంటే సహజంగా ఎవ్వరూ నిర్వచించలేరు- కాని! మన దృక్పథంలో ప్రేమనేదానిలో కామం, మరణం ఇమిడియున్నాయని తెలుస్తోంది- నిర్మల నిర్వ్యాంచిత ప్రేమకి, కామోద్రేకంలో కల్గినప్రేమకిచాలా వ్యత్యాసముయుంది- అసలీప్రేమనేది స్త్రీపురుషుల హృదయాలల్లో పుడుతుంది- చిన్నచిన్న ఉపనదులన్నీ కలసి ఎలాగయితే

ప్రేమంటే సహజంగా ఎవ్వరూ నిర్వచించలేదు_కాని! మన దృక్పథంలో ప్రేమనే దానిలో కామం, మరణం ఇమిడియున్నాయని తెలుస్తోంది. నిర్మల నిర్వాంచిత ప్రేమకి. కామోద్రేకంలో కల్గిన ప్రేమకి చాలా వ్యత్యాసముయుంది-అసలీ ప్రేమనేది స్త్రీ పురుషుల హృదయాలలో పుడుతుంది-చిన్న చిన్న ఉపనదులన్నీ కలసి ఎలాగైతే సముద్రంలో కలసిపోతున్నాయో ఆవిధంగానే ఈప్రేమవాహినులన్నీ హృదయ సముద్రాలలోనే కలసిపోతాయి_ అంటే స్త్రీ పురుషుల హృదయాలలో పదిహేను సంవత్సరాలపాటు దాగొని యుంటుందన్న మాట! ఆ యౌవన కాలం సమీపించేటప్పటికి ఆ ప్రేమపొంగి, నానా వికారాలను పుట్టిస్తుంది-ప్రేమంటే ఇంతవరకే నిర్వచించగలను-ఇంక స్త్రీ పురుషులు ప్రేమించుకొనడంలో చెప్పవలసింది చాలా యుంటుంది—తోటి వారంతా ప్రేమించి పెళ్ళిచేసుకొనడం మంచిదంటూ ప్రోత్సహించాడు. అది చాలా పొరపాటు—

ఎలాగంటే......!

ఇద్దరు యౌవన స్త్రీ పురుషులు ఒకే కాలేజీలో, ఒకే తరగతిలో చదువుతూయుంటారనుకోండి_రోజూ వారు చూసుకొనే సహజ చూపుల్లోనే అనుకోకుండా వలపు దొంతరలు పుడతాయి—వాడు కలసి మెలసి (Frea) మాట్లాడుకొనే మాటల్లో వలపు మాటలు గెంతులు వేస్తాయి. అది వారికి కామోద్రేకం కలిగే స్టేజి- ఆకారణంచేత ప్రేమంటో ఇద్దరూ ఏకీభవించి పోతారు-ఒకళ్ళ నొకరు గాఢంగా ప్రేమించుకొన్నా మనుకొంటారు—ఇంక వారి ప్రేమాశయాలు నెరవేరేదెట్లా? ఈ విషయం వారి వారి పెద్దలతో చెబితే అంగీకరిస్తారా? ఎన్నటికీ అంగీకరించరు. మరింక వారి ఆశలు నెరవేరాలంటే ఇద్దరూ తెగించాలి- తెగించాలంటే పరారి అవ్వాలి-పరారిఅవ్వాలంటే ముందు భవిష్యత్ జీవితము సుఖంగా గడపాలి-భవిష్యత్ జీవితము గడవా

లంటే పుష్కలంగా ధనం కావాలి-ధనం కావాలంటే ఇంట్లోనే దొం గిలించాలి-ఇంక ఇంట్లోనే కన్నం వేశారంటే ఎంత ద్రోహం చేస్తు న్నారో ఆలోచించండి-

సరే అలా దొంగతనం చేసి ఇద్దరూ పరారి అవుతారు. దొం గిలించిన ధనమంతా ఎంతకాలమని వస్తుంది? పరారి అయినపురుషుడు ప్రయోజకుడవుతే పదిగాళ్ళు సంపాదిస్తాడు.

లేనివాడి గతి ఏంకాను? ఇద్దరూ ఒక ప్రేమ ప్రేరేపణవల్లనే పరారి అయి వస్తారు-మరి వారి ప్రేమలకు ఏమైనా క్షేమముందా?

కొన్నాళ్ళకు తెచ్చిన ధనమంతా హారతికర్పూరంలా హరించి పోతుంది-ధన సంపాదన చేయలేని పురుషుడ్ని నానా చివాట్లు పెడు తుంది ఆ స్త్రీమూర్తి-మరి దాని స్వచ్ఛప్రేమ ఏమైపోతుందో? ధన మున్నంత కాలము అతనిపై ఆమెకు ప్రేమ యుంటుందా? ధన సంపా దన లేనివాడిని నీచుడులా చూస్తుందా ఆడది? ఇదేనా ఆమె ప్రేమ? ధనానికి ప్రేమకి సంబంధం యుందా? చివరికి ఆమెమనస్సు ధనమున్న మనస్సుని ఆకర్షిస్తుంది- చంచల హృదయురాలు, హంతకురాలు అయిన ఆ స్త్రీ మొదటి ప్రేమికునకు ఉద్వాసన ఇస్తుంది. అంత వాని గతి ఎంత నీచ స్థితిలోయుంటుందో చూడండి! వాడి జీవితం ఎంత ఎండిపోతుందో ఆలోచించండి!

అసలు స్త్రీది చంచల హృదయమని ఆధునిక కవులంతా ఊరి కనే అన్నారా!

ఆ వత్సంలో ప్రేమించి, పరారి అయి, పెళ్లిచేసుకొన్న వాడి జీవితం ఎంత అనహ్యామవుతుందో చూసారా! అవమానాన్ని సహిం చలేక (స్వంతభార్య పరాయి పురుషులతో పచార్లు చేస్తోందంటే అవ మానంగదూ?) ఆత్మహత్య చేసుకొంటాడు-ఇటువంటి విషయాలు వివ రాలతో ఎన్ని వినటంలేదు? ఎన్ని చూడటంలేదు!

కాబట్టి ప్రేమించి పెళ్ళిచేసుకొన్నంత బుద్ధిపొరపాటు మరేదీ లేదనే నాఅభిప్రాయము.

కాని! ఈపైవిషయాలు స్వార్థపరులైన స్వతంత్రులకు మాత్రం చెందదు- వారికయినా ఒకప్పుడు జీవితంలో భేదాభిప్రాయాలు రావచ్చును—

ఇంక నాఅభిప్రాయము ఏమంటే......

పెళ్లిచేసుకొని ప్రేమించడంలో కొంతఅందం...ఆనందంవుంది- ఎలాగంటే, మీరుయుక్తవయస్కులు కాగానే, తలిదండ్రుల అదుపాజ్ఞల్లో యుంటారుగాబట్టి, సహజంగా మంచిసంబంధం చూసి పెళ్లి చేస్తారు పెద్దలు- మీకుజ్ఞానం వచ్చినతరువాతనయినా, తనకు పెళ్ళిఅయిందనీ, కష్టసుఖాలలో ఆమెకుసహభాగం యుందనీ, జీవితరథము ఆమెతోనే నడుపబడాలని, ఎప్పుడో వకప్పుడయినా అనుకోక మానదు-

ఆవిధంగానే ఆభార్యకూడా, తనకోభర్తనే వ్యక్తియున్నాడని, తనభవిష్యత్ జీవితంలోని చీకటివెలుగులకు ఆభర్తే కర్తని, శాస్త్రమునమ్మతంగా పెళ్లిఅయిందిగాబట్టి జీవితాంతకాలమూ ఆతనితోనే కాలం వెళ్ళబుచ్చాలని, ఆవిధంగా భర్తను ప్రేమించుకొంటూ, ఆరాధించుకొంటూ, ఊహాసౌధాలు నిర్మించుకొంటూయుంటుందా పవిత్రమూర్తి—

ఇంక వారిద్దరిలోనూ నిర్మలమైన శాశ్వతప్రేమ అంకురించివారి జీవితాలను జ్యోతిర్మయం చేస్తుంది- పవిత్రప్రేమంటే వారిదే!

ఇంకా విషయాలు చెప్పాలంటే చాలాయుంది- నేటిఆధునిక యువతీ యువకులు తీవ్రంగా ఆలోచిస్తె నిజానిజాలు తెలుస్తాయి— ఇంకో ముఖ్యవిషయం చెప్పి ముగిస్తాను.

తోటియువతీయువకుల అభిప్రాయాలనుబట్టి, ప్రేమించే గొప్ప ధనవంతుడ్ని పెళ్లాడుతుంది ఒకయౌవ్వనయువతి- కొంతకాలం వారిద్దరూ హాయిగా సుఖంగా ప్రణయసామ్రాజ్యంతో విహరిస్తూ, గాఢంగాప్రేమతోయుంటారు- కాని! విధికృతానికి ఎదురేగలేమనే విషయం అందరికీ తెలిసిందే! విధిగాబట్టి ఆప్రేమికునకు ఏమశూచికమోతగులుతుంది- ఆవ్యాధితో బయటపడేటప్పటికి తాతలుదిగివస్తారు- అంతటితో మొహం అందవిహీనమై అసహ్యంగా తయారు అవుతుంది- అప్పుడాస్త్రీమూర్తికియుండే భర్తభావము ఎంతనీచంగాయుంటుందో చెప్పలేము- అతనిమీదయుండే ప్రేమవాత్సల్యాలు రానురాను తగ్గిపోతాయి- అసహ్యంతో ఏవగించుకొంటుంది- మనస్సు తప్పుదారినిబట్టి అతనిని వంచిస్తుంది.

ఇదేనా ఆమెకర్తవ్యము? ఇదేనా ఆమెయొక్క నిర్మలప్రేమ? ఆలోచిస్తారుగదూ నాకు తోచినమటుకు అల్పాభిప్రాయాలను వెల్లడిచేశాను- ఇందులో నాబుద్ధిపూర్వకంగా వదలిన తప్పులుంటే క్షమింపప్రార్థన- పైఅభిప్రాయాలను ఎవరినీ ఉద్దేశించి చెప్పలేదని గ్రహిస్తారని నామనవి— శలవ్! శలవ్!!

అంటూ ఉపన్యాసాన్ని ముగించాడు మోహనబాబు- ఆనాటి మీటింగులో అతనివాక్చాతుర్యానికి, అతనిబుద్ధికుశలతకు, హెడ్మాష్టరుగారు చిన్నవెండికప్పును ప్రైజంటు చేస్తానని సభాముఖంగా తెలియబరిచారు—

ఇలా అతనిస్కూలుఫైనలురోజులు జరిగాయి- కాని! దైవకృపలేక స్కూలుఫైనలు తప్పాడు- నిజంగాస్కూలుఫైనలుక్లాసు మొదటి ఛాన్సులో దాటినవాడు అదృష్టవంతుడనే చెప్పాలి—

అదీగాక నేటిపాఠశాలలలో చెప్పరానంత అన్యాయం జరుగుతోంది. ఆదేమంటారా...ఫోర్తుఫారంవరకూ కలక్టరుగారి కొడుకని

కోమటివుల్లయ్య మనుమడని [లేకపోతే పంచదార ఇవ్వడనిభయం] ఎల్లమ్మ అల్లుడని, జమీందారుగారి ముద్దులపట్టియని, ఇలాప్రైక్షాను లు తోపుడుబండి అవుతుంది. ఇంక అక్కణ్ణుంచి వడబోత మొదలు పెడతారు- కొంచెం సరుకుయున్న వాడైతే స్కూలుఫైనలు దాకా గెంటుతాడు- లేదా ఆఫోర్తు, ఫిఫ్తుఫారాల్లోనే గజనీమహమ్మదు దండ యాత్రలు సాగిస్తాడు, అంతటితో విసిగి మేష్టర్లు ఆఘటాల్ని స్కూల్ ఫైనలులోకి గెంటుతారు—

అక్కడనుంచి కొత్త భాగవతము, ఏమకింగాయున్న పిఱ్ఱవా ళ్ళంతా బట్టిపట్టడం సాగిస్తారు. డిశంబరు నెలవస్తుంది విసలాగ, సెలక్ష నుపరీక్షలు (సెలక్షన్సు) పెడతారు- ఆపరీక్షలలో కొంతమంది ప్రము ఖుల్ని దిగదుడిచేస్తారు- దాంతోటి పెద్దవడబోత అవుతుంది. తెల్ల, మొహాలువేసుకొని మానివేశిన కుర్రాళ్ళింతా ఆమూడు నెలలూ ఊరి కనే కూర్చోవడము ఎందుకని టైపు నేర్చుకుంటారు.

ఇంక పబ్లికుపరీక్షకు వెళ్ళేవాళ్ళసంగతి, పాపం! సెలక్షన్సులో నెగ్గామనే సరదామీద రాత్రింబవళ్ళు తెగ చదువుతారు— పెద్దపరీ క్షలో అదృష్టంయున్న వాడు ప్యాసు అవుతాడు— లేనివాడి నెత్తి మీద మునుగే! ఒక్కొక్కసారి చచ్చేదద్దమ్మ ప్యాసవుతూ యుం టాడు. అదంతా అదృష్టంఅనకతప్పదు, ఈవిధంగా ముప్పయిమం దికి పదిమంది ప్యాసుఅవడం కష్టంగాయుంది నేటివిద్యా విధానంలో—

నేటివిద్యావిధానంలోని స్కూలుఫైనలు విద్యార్థుల బీదద తలు తలందికొంటోంటే కన్నీర్లు కడవలుగా కారకమానవు—

అటువంటి దురదృష్టవంతుల జాబితాలలోనే మోహన్ కూడా చేర్చబడ్డాడు. ఆనాడు స్కూలుఫైనలు పరీక్షాఫలితాలు పేపర్లో ప్రక టించ బడ్డాయి—

నీనెంబరు ఎంతోయ్!" అడిగాడు తండ్రి.

"13064" అంటూ తడబడుతూ సమాధానమిచ్చాడు.

మోహన్ తండ్రిచేతిలో ఆంధ్రపత్రికయుంది. తను ఫైలైనట్లు మోహన్‌కు తెలుసు— పాపమా తండ్రి కొడుకు నెంబరుకోసం పేపర్లో వెదకడం ప్రారంభించాడు.

అసలు నెంబరుంటేగా!

'నెంబరు పడలేదు నాన్నగారూ! మెల్లగాఅన్నాడు మోహన్

'అంటే ఫేలయినట్లేగా!

'ప్యాసులవుతేగా నెంబరుపడటానికి" వెటకార సమాధాన మిచ్చాడు తండ్రి—

మోహన్ ఏమీమాట్లాడలేదు.

"మిగతా ఛాన్సుకూడా కట్టిచూడు! అన్నాడుతండ్రి.

ఆమాటవల్ల మోహన్ కొంతసంతృప్తిపడ్డాడు. ఇలా మోహన్ విద్యార్థి జీవితం గడిచింది కొన్నాళ్ళు.

---

## 3

అవి స్కూలుఫయినలు రెండోసంవత్సరము చదివే రోజులు— మోహన్‌కు ఆవిడాదిలో రచనలవ్రాసే అలవాటు ఎక్కువైయింది. నేటివిద్యావిధానంలో జరిగే అన్యాయాలు, విద్యార్థులకష్టాలను, వివరించివ్రాస్తూ పత్రికలకు పంపేవాడు ప్రకటన న్యాయమా? ఆవిడాదిలో ఆతనికి స్థానిపేరువచ్చింది. కాని,

కాలచక్రం కుమ్మరిసారెవలె తిర్గిపోయింది. పబ్లిక్ పరీక్షలు దగ్గరకు వచ్చాయి. మోహన్ చదువుతోనే, విసిగి, పుస్తకాన్ని గుండెలమీద పెట్టుకొని అలాగే నిద్రపోయేవాడు. అతని బుర్రలో అనేకమైన ఆలోచనలు అంతూ పంతూ లేకుండా పుట్టేవి- ఒక్కదానికీ తల తోక అనేది యుండేదికాదు —

ఈపరీక్షలో ఎలా ఉత్తీర్ణుడు కావడం! ఏవిధంగా చదువుతే ప్యాసు అవగలను! ప్యాసు అయ్యేవాళ్ళంతా ఎలా అవుతున్నారు! ఇలా పరిపరివిధాల తన స్వప్నవిద్యార్థి జీవితాన్ని తర్కించుకొంటూ నిద్రపోయాడు —

అతని కలవరపు బ్రతుకులో అదికలత నిద్ర .....

మోహన్ పార్కులో చల్లనిగాలితింటూ, సిగరెట్టు పొగలతో చిట్టిమేఘాలను నిర్మిస్తూకూర్చొనియున్నాడు- చల్లటిపిల్ల వాయువులు వీస్తున్నాయి- మోహన్ చేతిలో కెమేరాయుంది... హఠాత్తుగా జీవనయౌవనస్త్రీ అతనిపక్కనేవచ్చి కూర్చొంది॥ రెండునిముషాల పాటు రెప్పవాల్చకుండా ఆకన్యనుచూసాడు మోహన్ బాబు, అతనిమనస్సు ఏదో తెలియని ఆనందంకోసం తహతహలాడిపోయింది.

"మీ పేరు తెలుసుకోవచ్చునా!

"సుం...ద.. రి!"

'నివాసస్థలము!"

"ఈ ఊరే!"

"ఏంచేస్తున్నారు!"

'చదువుకొంటున్నా!"

"ఏకాలేజీలో...!"

'ట్రెయినింగ్ కాలేజీలో...!

'... ... ...'

"మీ రేంచేస్తున్నారో తెల్సుకోవచ్చునా ?

'నేనొకసుప్రసిద్ధ కవిని నవలలు వ్రాస్తూయుంటాను_ ప్రస్తుతం ఏకోర్సొద్ది చదువుతున్నా!"

'మీ పేరు? ఆదుర్దాగా అడిగిందాయువతి—

"మో...హ...న్;

'ఆఁ! మీ రేనా ఆనవలా కారులు! ఇవాళ మిమ్మల్ని కల్సుకోవడము నా అదృష్టము—అంటూ కరస్పర్శచేసి దగ్గఱగా జరిగింది.

అంతవరకు స్త్రీ స్పర్శఎరుగని మోహన్‌కు ఆసంఘటనతో చైతన్యం పొందాడు కొంతసేపు—

"కవికుమారులుగారూ! నేను మిమ్మల్ని ఎంతో ప్రేమిస్తున్నా!

'నేనూ ప్రేమించడానికి ప్రయత్నిస్తాను!' జంకులేకుండా అన్నాడు మోహన్—

"అబ్బ! ఇన్నాళ్ళకు నా ఆశలు ఆశయాలు నెరవేరేకాలం వచ్చింది! అంటూ అతని ఒడిలో ఒరిగింది సుందరం—

"సుందరీ! ఆశలు, ఆశయాలు నెరవేరితే ఆలిమగలు అవుతారనే నమ్మకం ఏముందిచెప్పు! అన్నాడు తలలోని పువ్వులువాసన చూస్తూ—

"అబ్బ!— — —!' అంటూ సుందరి మరింత ఘట్టిగా కౌగలించుకొంది—

ఆమె కౌగలిలో రెండునిమిషాలు తన్మయత్వం చెందాడు మోహన్ బాబు—

"————————'

"————————'

"ఒరే మోహన్! ఏమిటానిద్ర? అలారం మూరుమ్రోగుతున్నా వెధవనిద్రేనా? లేవరా కుంభకర్ణా— పరీక్షలు దగ్గరకు వచ్చాయి!" అంటూ తండ్రి మోహన్‌ని లేపాడు—

అదురు బెదురులతో సుందరి కౌగిలినుండి బయట పడినట్లు, మోహన్ తుళ్ళిపడి లేచాడు- ఏముంది?

సుందరీ లేదు- పార్కూ లేదు- తనచేతిలో కెమెరా అంతకన్నా లేదు— జరిగిన సంఘటనలన్నీ కలలో అని తెల్సుకొన్నాడు— ఎదురుగా యున్న తనఫొటో, తనపుస్తకాలు వెక్కిరించినట్లున్నాయి.

కాని! అతనికింకా సుందరి కౌగిలోయున్న స్ఫేయుండేది— తెల్లవారగట్ల చదువుతే బుర్రకు ఎక్కుతుందేమోయనే సిద్ధాంతం అనుసరించి పుస్తకం తెరిచాడు, అబ్బే! ఒక్కముక్కయినా...! సుందరి యొక్క సుందరవిగ్రహం మాత్రం హృదయంలో చిత్రించబడింది— మొత్తానికి అతనిమనస్సు సుందరిమీద లగ్నమైపోయింది—

స్వప్నములో అగుపించిన సుందరి ఎలాదొరుకుతుంది? ఆ డ్రీంగరల్‌ని ఎలా కనుక్కోగలడు? పోనీ! సుందరి చిరునామా అయినా తెల్సుకొన్నాడుగాదాయెను! అతనిహృదయ దేవాలయంలో సుందరి విగ్రహం ఆనాటి స్వప్నంతో ప్రతిష్ఠింపబడింది- పాపము! సుందరి కోసం వెదకడం ప్రారంభించాడు— ట్రెయినింగ్ కాలేజీ అంతా గాలించి నాసుందరివిగ్రహం కనుపించనే లేదు- ఇంతకీ అంతపెద్ద కవికి ఇంతపిచ్చిపట్టిందేమాయనే అనుమానం కల్గకపోదు- కాని! అతనికి ఇంతవరకు కలలో జరిగే విషయాలన్నీ యదార్థాలే అవుతున్నాయి.

స్వప్నసుందరికోసం ఇన్నిపాట్లు పడుతున్నాడంటే మనకందరికీ హేళనగానేయుంటుంది- ఏంచేస్తాము? అతని ఆరాటం మనకేం తెలుస్తుంది?

పరీక్షలు సమీపించేశాయ్! ఏపుస్తకం తెరిచినా, ఏపుటతిరుగవేసినా సుందరివిగ్రహమే అగుపించేది- సుందరి తననివలపుపిలుపులచే పిలుస్తున్నట్లుండేది. పగటికలలు ఎక్కువయ్యాయి- చేతిలో కవిత్వం యుందిగాబట్టి సుందరిమీద కలాన్ని కదిపి పద్యాలు వ్రాసేవాడు...,

స్వప్నసుందరిని వర్ణిస్తూ అనేక నాటికలువ్రాశాడు— రోజుకు రోజూ సుందరిమీద పిచ్చిభ్రమ అవరించింది—

పబ్లిక్ పరీక్షలుపూర్తిచేసాననిపించాడు. అప్పటికే పెళ్లిచేసుకోమని తండ్రి అనేకవిధాల చీవాట్లుపెట్టాడు— సిగ్గులేకుండా, అమాయకత్వాన్ని వెల్లడించుకొంటూ. తనలాస్వప్నంలో సుందరిఅనే యువతిని ప్రేమించానని, ఆమెను తప్ప ఇంకెవర్నీ పెళ్లిచేసుకోనని తండ్రికి తెలియబరిచాడు—

'ఇంకా పెళ్ళి ఈడురానట్లో తేగదా అలాఅనడం! పెళ్ళిచేసివుంటే ఈపాటికి యిద్దరుపిల్లలు పుట్టియుందురు- నామాటలు పెడచెవినిపెట్టక త్వరలోనే పెండ్లిచేసుకో!'

అబ్బే! నువ్వు లక్షచెప్పు- నేనాస్వప్నసుందరిని తప్ప అన్యుల నెవర్నీ పెళ్ళిచేసుకో దలుచుకోలేదు—

'ఓసి పిచ్చినాయనా! స్వప్నసుందరేమిటా్రి నీబొంద? పెళ్ళి చేసుకోకుండాఇంకాయున్నావంటే అలాంటి సుందరీమణులు నిన్నింకా బాధపెడతారు- నామాటవిని త్వరలో......"

'అబ్బా! అదంతా నాకుపనికిరాదు, ఆసుందరే నాకుగావాలి!

అదెలా సాధ్యంఅవుతుందిరా?

"అయినప్పుడే చేసుకొంటాను- లేకపోతే ఇలా బ్రహ్మచారి లాగానే యుంటాను. తంటా ఏముందినాన్నా?'

ఇప్పట్లో పిడికింత బుర్రతిరుగుడు రోగం కుదరదని అప్పటికి పెళ్లిప్రయత్నం విరమించుకొన్నాడు ఆతండ్రి—

ఓరోజున రిజల్ట్సువచ్చాయి— ఈసారికూడా అబ్బాయిగారి పరీక్ష గిరికీకొట్టింది. అప్పటికే సుందరికోసం విసిగి వేసారిపోతూండు- ఈసారి రిజల్టుతో మరింత నిరుత్సాహుడయ్యాడు మోహన్—

"సున్నప్పుడిత వెధవ! స్కూలుఫయినలు మూడేళ్ళు తగుల

పెట్టినముండా....నామాటవిని పెళ్లి చేసుకొని పడియుండు— పోతేపో యిందిలే పెళ్ళపరీక్ష, రా! పిల్లనిచూడ్డానికి వెళ్దాం!' అంటూ తండ్రి మోహన్‌ను అప్పటికప్పుడే పిల్లని చూడ్డానికి తీసుకొని వెళ్ళాడు—

మోహన్ ఏమీచేయునదిలేక సుందరిని స్మరించుకొంటూనే తండ్రి వెంట బయలుదేరి వెళ్ళాడు, యథోచితంగా వారికి సత్కా ర్యాలు జరిగించబడ్డాయి- పెళ్ళికూతుర్ని అలంకరించి తీసుకొని వచ్చారు—

ఆశ్చర్యము!! అసంభవము!! అనుకోనవిసంఘటన!

ఈయువతే మోహన్ యొక్క స్వ...ప్న...సుం...ద...రి!

"నాన్నా! ఈఅమ్మాయేనా సుందరి. ఈమాటముందే చెబితే అప్పుడే పెళ్లిచేసుకొందునుగా!' అంటూ సంతోషంతో మెల్లగా తండ్రితో పలికాడు—

"ఏడ్చావులేవోయ్! అసలు నీకిష్టమైనట్లేనా!! అడిగాడుతండ్రి—

'అభ్యంతరం ఏమీలేదు' ధైర్యంగా అన్నాడు మోహన్.

ఆపెళ్లి పెద్దలంతా వెంటనే అన్నివిషయాలు సెటిలు చేసే సారు— ముహూర్తంకూడా నిశ్చయించేశారు, అచిరకాలంలోనే మోహన్ పెళ్లిజర్గిపోయింది. ఇంక మోహన్ ఆనందానికి అంతేలేదు, తానుకోరిన సుందరిని పొందాడుగదాయని ఎంతోసంతోష పడ్డాడు.

ఆసుందరే ఇప్పటిమోహన్ ధర్మపత్ని రాధ, ఆకారణంచేతనే రాధ నాస్వప్నసుందరిఅంటూ ఆప్యాయంగా పిలుస్తాడు. ఆవిధంగా కాలంగడుపుతూ వచ్చాడు.

మోహన్ తండ్రికి పెద్దకాలంకూడా సమీపించింది. ఆకార ణంచేత ముందాతని జీవితంలో మార్పులు రావచ్చును. కాని! భవి ష్యత్ మనం నిర్ణయించలేముగా?

# 4

రెండేళ్ళపాటు సుఖంగా రాధతో కాలంగడిపాడు. కాని! అతని తండ్రికి పెద్దకాలం సమీపించుటచేత, సదా తండ్రినే కనిపెట్టుకొని యుండవలసి వచ్చింది—

ఇంక వారి ఆస్థి పాస్థులను గురించి కొంత చెప్పటం అవుసరం.

రాజమండ్రిలో మోహన్ తండ్రికి రెండుదివ్యమైన మేడలు న్నాయి, మోహన్ పుట్టక పూర్వంనుంచీ ఆయన కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగాపనిచేస్తూయుండేవాడు, రానురాను ఆయన హెడ్ గుమాస్తాగా అయినాడు.

అదీగాక ఆయనకు పిత్రార్జితమైన ఆస్థి సుమారు లక్షరూపాయల వరకుయుంది. కాని! సంతానంలేకపోవడంవల్ల ఆయన ఎక్కువ విచారపడేవాడు, ఎంతఆస్థియున్నా, తనవంశం నిర్మూలమై పోతుందని భయపడేవారు. ఆదంపతులు ఇద్దరూ చేయనివ్రతాలు, నోములు లేవు, దర్శించని తీర్థయాత్రిలులేవు, కొన్నాళ్ళకు వారి పుణ్యసంపద వలన ఒకపుత్రుడు పుట్టాడు. అతడేమన కవికుమారుడు మోహన్!

కవికుమారుని జననంతో, తల్లి,స్వర్గస్థురాలైంది. లేకలేక కొడుకుపుట్టడంవలన మోహన్ తండ్రి, ఉద్యోగాన్ని వదలుకొని, సదా కుమారునినే కాపాడుతూయుండడంలోనే కాలం గడచిపోయేది-

స్కూలుఫైనల్ వరకు జాగ్రత్తగా కుమారునిచదివించారు— అబ్బాయిగారిచదువుకు అక్కడే పెద్దబ్రేకుపడింది. తండ్రి కొడుకుకు పెళ్లిచేసాడు- ఆయనకు సలభై ఏండ్లు దాటాయి- ఉన్న ఆస్తిఅంతా మోహన్ పేరవ్రాసి ఇచ్చేసాడు- కొంతకాలానికి ఆమునలిప్రాణం అనంతవాయువులలో లీనమైపోయింది—

ఇక వ్యవహారములన్నీ చూసుకొనే బాధ్యత మోహన్ భుజస్కంధములమీద పడింది—

"రాధా! మనమిలా సోమరిపోతుల్లా తింటూ కాలంగడిపితే ఏంలాభంచెప్పు. భగవంతునిదయవల్ల ఇంతవరకు ఏలోటూలేదు—కానీ! నేనిలా తింటూకూర్చోవడము ఏమీబాగోలేదు!—" అన్నాడు మోహన్ ఒకరోజున—

'అంతగా అభిలాషయుంటే ఏదైనావ్యాపారము (బిజినెస్) పెట్టు" అంది రాధ—

'అదే నేకూడా ఆలోచిస్తున్నా- ఏంచేదామో నువ్వేచెప్పు"

"నాకేమీతోచడంలేదు— ఏంవ్యాపారంచేసినా ఆశోమట్లకే చెల్లుతుంది— పోనిద్దురూ విధవవ్యాపారము—మీరా కష్టసుఖాలకు ఓర్చుకోలేరు.'

'అయితే సరే! ఎలావీలుంటే అలా చేదాము."

రెండునిముషాలు నిశ్శబ్దంగా గడిచింది— అప్పటికి తొమ్మిది గంటలయింది—

"రాధా! నువ్వునన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావా!"

'ఏం? అలా క్రొత్తగా అడుగుతారే..? నాప్రేమను మీరు శంకిస్తున్నారా?"

"కాదు—నువ్వు ప్రేమిస్తున్నావా అని అడిగాను. అంతే...'

"ప్రేమించకపోతే మీదగ్గర ఇంతకాలం ఎందుకు ఉంటాను? మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను—" అంది రాధ చిరునవ్వుతో—

"ఆడదానిహృదయం తొలగనినిండుకుండ. నవ్వుకొంటావా!"

'ఇవాళ మీరిలా నన్నుఎందుకుప్రశ్నిస్తున్నారో అర్థం గావడంలేదు—కాని! నాహృదయాన్నివిప్పి మీతోమాట్లాడుతున్నానని మాత్రం గ్రహించండి!—'

"ఆపత్కంలో మనిద్దరిభావాలు...ఆశయాలు ఒకటైతే...!'

'......పకటయితే......!"

"......ఎందుకు సంతానం కలగలేదు ఇంతవరకు......!"

"భగవంతునిప్రశ్న వేశారే కవిగారు! సంతానం కల్గకపోవడం మనదురదృష్టము!"

"లేదురాధా! నువ్వునన్ను ప్రేమిస్తున్నావని అనుకొంటున్నావుగాని, నీహృదయం ప్రేమించటంలేదు"

"ఈభావాలు, భాష నాకు అర్థంకావడం లేదు"

"అర్థంకావడంలేదుగనుకనే మనిద్దరిభావాలు, ఆశయాలు ఏకీభవించడంలేదు—అందుకనే నువ్వు నన్ను ప్రేమించడం లేదంటున్నాను-

'ఆకారణంచేతనే మనకి సంతానం కలగటంలేదు—"

"మీరునన్ను అంతులేని అగాధంలోకి దింపేటట్లున్నారు"

'నిజంగా అంతేచేయదల్చుకొన్నాను— ప్రపంచంలో ఏదంపతులకు సంతానంకలుగకపో వారిద్దరూ భార్యాభర్తలుగా పరిగణింపబడడానికి అనర్హులనే నాఅభిప్రాయము— వారిద్దరూ ప్రేమించుకొని కాలంగడుపుతున్నామనుకొంటారు గానిఅది వట్టికల్ల—అదంతా కృత్రిమప్రేమ!"

"అయితే మీఉద్దేశప్రకారం నేను మీభార్యగా ఉండతగననే మీఅభిప్రాయము—నాప్రేమంతా వట్టిబూటకమనేగా మీ ఉద్దేశ్యం!"

"ఆ! ఢంకామీద దెబ్బకొట్టిచెబుతా— ఇప్పుడుకాకపోయినా, కొన్నాళ్ళకైనా ఇష్టరిమనస్సులు విరిగిపోతాయి—ఆనాడు తెల్సుకొంటారు వారిప్రేమవిషయాలు—

రాధా! చెబుతున్నావిను. సంతానం కలుగని భార్యాభర్తలువిడిపోవడము చాలామంచిది— విద్యలేనివాడు పశువుతో సమానం

అన్నట్లు. సంతానం లేనివాడు నరకంపాలవుతాడు_ సంతానంకోసం భార్యాభర్తలు విడిపోవాలి- ఎవరికిష్టమొచ్చినవాళ్ళని వారు పెళ్లాడాలి—సంతానం పొందాలి—అప్పుడు వారిలో ఏవరు కరువనిపోయినా వంశం నిలబడుతుంది గాబట్టి చింతయుండదు—నా ఉద్దేశ్యాలతో ఏకీభవిస్తావా లేవా!-"

"ఉహుం! భారతస్త్రీకి ఇవన్నీ తగనివిషయాలు—భర్త ఎంత అప్రయోజకుడైనా భర్తే ఆమెకు దైవము—మీ ఉద్దేశ్యాలతో నేను ఏకీభవించను"

"అందుకే నీవంతా కృతిప్రమపేర్రమంటాను!"

"అలాఎన్నటికీ కాదు- సంతానంకలుగకపోవడానికి, భార్యల భావిజీవితానికి భర్తలే కర్తలు- తెలిసిందా!'

"ఎన్నటికీకాదు— భార్యల అదృష్టదురదృష్టాలమీద భర్తల భావిజీవితమే మారుతుంది ముందుగా— ఇదంతా నన్ను కట్టుకోవడంవలన వచ్చిన నష్టమేఇది—'

"కాదు- మీవల్లనే...!'

"కాదు- నీవల్లనే నాఅదృష్టం చెడింది!"

"నేను మీలాగ వాదించలేను మాటిమాటికి- భర్తలు అప్రయోజకులైతే భార్యలు ఏంచేస్తారు!'

"ఆc! నేను అప్రయోజకుడనా!—'

"అవును. మీరు అప్రయోజకులు, అసమర్థులు గాబట్టి సంతానం కలుగలేదు— అల్పబుద్ధి గలవారుగాబట్టి ఇటువంటి నీచబుద్ధులు పట్టాయ్—' అంటూ రాధ వెక్కివెక్కిఏడుస్తూ మరోగదిలోనికి వెళ్ళింది.

తానుపట్టినకుందేలుకు మూడేకాళ్ళు అనే మనకవికుమార్‌గారి మనస్సు అప్పుడప్పుడూ తివ్రంతోంవలను పడుతూయుంటుంది. అదీ

గాక తనతండ్రి వంశంలోనే ఎంత తాపత్రయం పడ్డాడో మనమోహన్‌కు తెల్సు. ఆవిధంగా చివరికి ఆ భార్యాభర్తలమధ్య ఇలాచిన్న చిన్న తగువులు ప్రారంభమై పెద్దతగువు లయ్యాయ్.

ఆఖరుకు రాధ విసిగి, వేసారి, మోహనని అప్రయోజకుడు, అసమర్థుడని అనింది. ఆమాటతో మోహనరావు బుర్రలోవున్న వట బొంగులు పేలిపోతున్నాయింది. "...నేను అప్రయోజకుడనా? ఛీ! భార్యచే అసమర్థుడననిపించుకొన్నాక ఇంక బ్రతికేలాభం? నేను ప్రయోజకుడనో, అప్రయోజకుడనో ఆమెకేం తెలుసు? పిల్లలుపుట్ట నంతమాత్రాన అదంతా నాఅప్రయోజకత్వమేనా? నేనేమైనా సృష్టి కర్తనా? ఛీ! ఇంతకంటె ఇంకేంకావాలి అవమానము! లాభంలేదు-నా ఆశలు...ఆశయాలు నెరవేరాలంటే రాధను తక్షణమే విడిచి పెట్ట య్యాలి. విడిచిపెట్టడం తప్పదు.

నామనోభావాలతో ఏకీభవించే లలనామణిని చేరదీస్తే నాఆ శలు పూర్తిగా కొనసాగుతాయ్. నావంశం నిలబడుతుంది.

అప్పుడు రాధకు తెలుస్తుంది నాప్రయోజకత్వము!

అవును! ఈనవనాగరికతాప్రపంచంలో పురుషుడు స్త్రీవద్ద ఫూల్ అవడం ఎంతనేవు! సిరాబుడ్డిలోపడి చస్తేమేలు. ఛీ! ఇంకనాకు రాధవద్దు. రాధతో సంసారం లాభంలేదు. అదెలా ఏమన్నానాకేం...?

అంటూ పరిపరివిధాల జీవితాన్ని చర్చించుకొంటూ వికల మైన మనస్సుతో నిద్రాదేవి ఒడిలో నిదురపోయాడు మోహన్.

ఇంక రాధదుస్థితి...కార్చేకన్నీరు గురించి వేరేచెప్పాలా?

తలగడాపై తలఆన్చి కన్నీరుచే పూర్తిగ తడిపివేసింది. తన భర్తకు ఇటువంటిబుద్ధి పుట్టిందేమాయని విచారించింది. తనకు సంతా నం ప్రసాదించని భగవంతుని అనేకవిధాల నిందించింది.

"అబ్బ! ఆయన హృదయభావాలతో ఏకీభవించకపోవడంవల్ల

తప్పువాడేనా? ఏదంపతులకైనా సంతానం కలుగకపోయినమొదల స్త్రీయేనా కారకురాలు? స్త్రీ ప్రపంచానికి ఎంతలోకువైపోయింది! మట్టిబొమ్మలా ఆడించాలని గాబోలు వారిఅభిప్రాయాలు!

సంతానం కలుగనిదంపతులకుండేది అంతా కృత్రిమప్రేమే నట! ఈయన నాహృదయంలో దూరి కాగడాలుపెట్టి వెదకి కనిపెట్టాడుగాబోలు! ఈయనమీదనాకుండే ప్రేమానురాగాలు ఆభగవంతునకే తెలుసు—

అవును! ఇకముందునుంచి కృత్రిమప్రేమే వుంటుంది. దానికి కారకురాలను నేనుకాదుగదా!

సంతానం కలుగనిదంపతులు విడిపోవడం మంచిదట! ఆహా! ఏమిటా ఉద్దేశ్యాలు? విడిపోయి వంచెయ్యాలో మరి? ఏముంది చేయడానికి హాయిగా ఇంకో స్త్రీని చేరదీసి స్వర్గసుఖం అనుభవిస్తారు గాబోలు!

అబ్బ! ఆవిధంగా స్త్రీ కూడా చేయాలట! ఛీ! అలా ఏభారత స్త్రీ కూడా చేతులార చేయలేదు. మగవారికంటే జ్ఞానంలేదు. వారికున్నంతధైర్యం స్త్రీలకేదీ! పురుషుడు ఎంతనీచకార్యాలుచేసినా ప్రపంచం చూస్తూ ఊరుకొంటుంది. అదే ఏస్త్రీచేసినా బ్రతికున్నంత కాలమూ అంపవుకోత పెడుతుంది.

ఇంక వారిధోరణిబట్టిచూస్తె పరస్త్రీని చేరదీసేటట్లున్నారు! ఆభగవంతుడా ? ఇంక నాగతేంకాను? నేనూ పరపురుషున్ని... ఛా! బ్రతికున్నంతవరకు అలాంటిపనులుచేయలేను— చేయను—!"

అంటూ విలపిస్తూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ పడుంది; పాపం! రాధహృదయం ఎంతక్షోభిస్తుందోగదా!

# 5

సంతానం కలుగలేదనే నెపంమీద ఆభార్యాభర్తలిద్దరికీ వాదోపవాదాలు తీవ్రంగా ప్రబలాయ్. మాటలు లేవు- వారిరువురికీ కాలం గడపటం దుర్భరంగాయుంది.

ఆవాదోపవాదాలకుతోడు వారికి స్వప్నవిరోధము వచ్చింది అవిధంగా రోజుకురోజూ ఏడ్చి, జీవితాలను తర్కించుకొంటూ నిద్రపోయేవారు—

అంతకుముందే మోహన్‌బాబు, తన ఆశయాలతో ఏకీభవించే స్త్రీ, ఎదురింటిలోనుండే అరుణాదేవి వక్కతేనని తెలుసుకొన్నాడు. ఇద్దరికీ కొన్నాళ్ళు చూపులు కలిశాయి— వారిద్దరూ తమ ఆశయాలను ఒకరితోనొకరు చెప్పుకున్నారు. ఆరాత్రి పన్నెండుగంటలకు ఇంటివెనుకనున్న మామిడితోటలో కలుసుకొందామని నిశ్చయించుకొన్నారు—

మోహనబాబులో కలిగే పరివర్తనంతా రాధకు తెలుసు— కానీ! తెగించి పరస్త్రీతో పోతాడా అన్న ధైర్యంతో యుంది రాధ—

రాత్రి పన్నెండు గంటలయింది-రాధ మంచంమీద పడుండి భర్తను తిలకిస్తోంది నిద్రపోతున్న దానిలా నటిస్తూ—

మోహనబాబు మెల్లగాలేచి, తలుపులు చప్పుడులేకుండా తీసి తోటలోనికి పోయాడు. అంతకుముందె ఎదురింటి అరుణాదేవి తోటలోనికివచ్చి, మోహనబాబు కోసం ఎదురు చూస్తోంది-మోహనబాబు ఆదుర్దగా ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకొన్నాడు—

మోహనబాబు ఎక్కడకు వెళుతున్నాడో చూద్దామని రాధ కూడా బయలుదేరి తోటవేపున్న గదిలోనుంచి దృశ్యాన్ని తిలకిస్తోంది కిటికీలోంచి—

పండువెన్నెల్లో మోహనబాబు, అరుణాదేవి, త్రాచుపాము లా పెనవైచుకొని ఆ పచ్చటిగడ్డి నేలమీద పరుండి, పళ్ళతో గడ్డికున కల్ని కొరుకుతున్న దృశ్యం స్పష్టంగా రాధ కళ్ళబడింది-వెంటనే ఆమె శరీరం గగుర్పాటు చెందింది-ప్రాణంపోతున్నట్లు బాధపడసాగింది రాధ-మెల్లగా వారి మాటలు వినబడసాగింది-రాధ ఆమాటలు విం దామనే కుతూహలంతో చెవులు నిగిడించి, వింటోంది—

"అహూ! నీ భర్త కుంభకర్ణుడిలా నిద్రపోతున్నాడా!—"

"అవును మోహన్! ఆయన ఎందుకూ పనికిరాని మొద్దు అవ తారంలే! నేనింత తంటాలుపడినా నానుండి ఆనందాన్ని పొందలేరు- నాకు ఆనందాన్ని ఇవ్వనూలేరు—

అహ్హ! ఇన్నాళ్ళకుగదా నాపూర్వ్రజన్మావ్వన సుఖాన్ని...అని వార్యమైన ఆనందాన్ని అనుభవించగలుగుతున్నాను! నిన్ను పొంద టం నా అదృష్టమనే చెప్పాలి—మో...హ...న్...!—

అని అంటోంటే ఆమె పెదవులపై మోహన్ పెదవులనుంచి ముద్దులవర్షం కురిపించి తన్మయురాలిగా చేశాడు—

భర్త అలా పరస్త్రీతో ప్రేమ సయ్యాటలు ఆడుతోంటే ఆ దృశ్యాన్ని చూడలేక రాధ ఒక్కసారి కళ్ళుమూసుకొంది—

"అహూ! మా ఆవిడకూడా ఎందుకూ పనికిరానిదే! ఒక్క విషయంలోకూడా నాతో ఏకీభవించదు-అది వట్టి పశువు—!—

అంటూ ఆమెను ఘట్టిగా కౌగలించుకొని పడుకొన్న పోజ్‌ని మార్చాడు.

ఇంక రాధ అవస్థ చెప్పాలా? ఏంచేయాలో అర్థంగాక అక్క డనుంచి వెళ్ళిపోయింది—కాని! మనస్సు మాత్రం ఆమెను ఊహా ప్రపంచంలోనికి తీసుకొనిపోయి వివిధ విషయాలను చర్చింపచేసింది— భర్త అలాపర స్త్రీతో ఆనందాన్ని అనుభవిస్తాంటే, భార్య మాత్రం

ఎందుకలా పరపురుషునితో ఆనందాన్ని అనుభవించకూడదు! ఒక విష యంలో తప్పు అని నిరూపించినపుడు ఆ విషయం స్త్రీపురుషులిద్దరికీ సమానంగానే వర్తించాలిగదా! స్త్రీ అంటే అంతచులకనగా ఎందుకు చూస్తుందీ ప్రపంచం? అంత లోకువా? ఎందుకీ స్వార్థపరత్వము? నా ఇచ్ఛవచ్చిన రీతిని తప్పాడడానికి ఈ ప్రపంచం ఎందుకు అడ్డుపెట్టుం దో చూస్తాగా!—అంటూ రాధ ప్రశ్న పరంపరలలో మునిగిపోయి ఎట్టకేలకు అలా చేయుడంవల్ల తప్పులేదని నిశ్చయించుకొని ఎదురింటికి బయలు దేరింది—

ఎందుకోమరి—???

నిజానికి చెప్పుకోవాలంటే అరుణాదేవి భర్తకూడా మంచి యౌవ్వనవంతుడే! అరుణ భర్తపేరు రామం-మంచి ఆస్తిపాస్తులున్న వాడు- కాని! ఆ భార్యా భర్త లిద్దరికీకూడా సంతానంవద్దనే వచ్చింది పేచీ-ఇంతవరకూ వారికి సంతానం కలుగలేదు-ఆ కారణంచేత ఒక్కొక్కప్పుడు ఒకళ్ళమీద ఒకరికి అయిష్టత పుడుతుండేది- కాని మోహనబాబులా పెళ్ళానికి ఏమీ ఉద్బోధన చేయలేదు—

అదీ గాక మోహనబాబు చూసే చూపులకు అరుణాదేవి ముగ్ధురాలై మనస్సును మోహన్‌మీదకి త్రిప్పింది—

రాధ తిన్నగా రామంవద్దకు వెళ్లి అతన్ని లేపింది—అతడు ఖం గారుగా లేచాడు- ఆ లేపినవ్యక్తి తన భార్య అరుణాదేవి యని రామం భ్రమపడ్డాడు-ఆ ఉద్దేశ్యంతోనే రాధ చేయిపట్టుకొని లేచాడు ఆ స్పర్శలో ఆనాడు ఏదో క్రొత్త ఆనందం కలిగినందున మరల పరి కించిచూసిఅరుణ కాదని తెల్సుకొని ఆదుర్దాపడ్డాడు-ప్రక్కనే శయనించి యుండవలసిన అరుణ లేదు-వానికేమీ తోచింది కాదు-రాధ ఎలా వచ్చింది? అరుణ ఏమై పోయినట్లు? ఇలా ప్రశ్నలు బయలు దేరాయి అతనిలో! కాని! అరుణ యని భ్రమపడి ఎలాచేయి పట్టుకొ న్నాడో అలానే ఉండిపోయింది ఆ చేతి బంధము.

అబ్బ! ఆ స్పర్శలో ఏదో మహత్తరమైన శక్తి ఉండి యుంటుంది గదా!

"ఏం—ఇలా వచ్చేశారు?"—ధైర్యంగా తడబడుతూ రాము ప్రశ్నించాడు రాధను-

"మీ భార్య మిస్సెల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నారా?"—ఆశ్చర్యంగా తిరిగి అడిగింది రాధ రామాన్ని-

"లేదు-ఈ మధ్యనే మాటా మాటా వచ్చింది మాకిద్దర్కీ!—అనుమానించకుండా జవాబిచ్చాడు రాము—

"సంతానం విషయంలోనే కదూ!"—

"అవును."—మీ కెలా తెల్సు నీ విషయం!—ఆశ్చర్యంగా ఆదుర్దాగా అడిగాడు రాము రాధాదేవిని—

"------"—రాధ జవాబు ఇవ్వలేదు.

"అయినా అరుణ ఇక్కడ లేదేం చెప్మా!"—లోలోపలనే ప్రశ్నించుకొన్నాడు రాము-

ఎందుకుంటుంది! ఇష్టంలేన్న నా భ...ర్త..వద్దకు వెళ్ళింది-వేడుస్తూ సమాధానమిచ్చింది రాధ—

'ఆ! నీభర్తని ప్రేమించిందా!—ఆశ్చర్యపోయాడు రాము-'

'అవును రాము! ఆయనకు నామీద అయిష్టత ప్రబలింది-మీ అరుణను ప్రేమించారు...!—

"నీమీద అయిష్టతకు కారణం?"-

'కారణం నాకు తెలియదు-రాము...రాము...సిన్నింతో...!"—సిగ్గుతో చెప్పలేకపోయింది-

ప్రే...మి...స్తు...న్నావా?- అడిగాడు రాము-

మౌనంగా చిరునవ్వు నవ్వింది రాధ-

రామం! అరుణను చూపిస్తానురా! మనకు భయం ఎందుకు!-

అంటూ రాధ రామం చేయిపట్టుకొని తోటలోనికి తీసుకొనిపోయింది-

చప్పుడు లేకుండా ఇద్దరూ తోటలోనికి ప్రవేశించారు- మోహనబాబు, అరుణ కూర్చున్న స్థలానికి దగ్గరలోనే రామం రాధ కూర్చొన్నారు- ఆ రెండు జంటలకి మధ్యగా ఒక గుబురుగా పెరిగిన గులాబీ డొంక యున్నందువల్ల ఒకరి ఉనికి ఒకరికి తెలిసింది గాదు-

మోహన బాబుకు తనభార్యవిషయంగురించి ఏకమయినా చింత లేకున్నా, అరుణతో కాలంగడపటంవల్ల ప్రపంచాన్నే మరచి ఆమె తొడలపై తలను ఆన్చి పడుకున్నాడు సుఖంగా-

రాముడు రాధతో తాత్కాలికంగ ప్రేమసమ్యాటలలోమునిగి ఆనందం పొందుతున్నప్పటికిని, స్వంతభార్య అరుణాదేవి పరపురుషునితో [illegible] చడం [illegible], [illegible]లో అహంకారాలు [illegible]! అనుమానంలో [illegible]? రామంకు ఈదృశ్యాలన్నీ ఆశ్చర్యంగాను, అర్థవిహీనంగనూ, కనబడింది.

రాముని రాధ తనప్రపంచంలో తిరిగేలా మార్చివేసింది. వారిద్దరూ ఏవో తీయనిపలుకులతో సంభాషించుకొంటూ, కిలకిలా నవ్వుతూ, ఒకళ్లమీద వకళ్లు పడుతూయున్నారు.

వారిద్దరి కిలకిలారవములు మోహన్ బాబుకు అరుణకు వినిపించాయి! అతోటలోనికి అన్యులెవరువచ్చారుచెప్మా యని ఆశ్చర్యపోయారు. ఆస్థలంనుంచి లేచారు.

ఇంకేముంది ! ! !

అరుణ రాముని చూచి స్థంభించిపోయింది. మోహనబాబు మాత్రం రాధచేసినపనికి మెచ్చుకొన్నాడు. అరుణ రామాన్ని చూడగనే భయపడిన లేడిపిల్లలా మోహన్ హృదయంమీద వ్రాలిపోయి గట్టిగ పెనవైచింది చిన్నపిల్లలా,

ఆవిధంగా అరుణ, మోహన్ కౌగిలిలో చేరుతున్నకొలదీ రామం హృదయం కోపాగ్నికి గురిఅయింది.

రాధని ఏవిధంగాను, ఏవిషయంలోనూ అడ్డుచెప్పలేదు గాబట్టి, రాధనిచూపి ఆమెనవ్వేచిగురునవ్వులతో తననవ్వును మేళవించి ఆనవ్వు పువ్వులను వెదజల్లాడు మోహన్‌బాబు.

రాముం రాధతో ఆనందం అనుభవించినప్పటికీ, ఆకోపం . . ఆనందం నిశ్శేషమైన మరుక్షణంలో అరుణను నరికివేయాలన్నంత కోపంవచ్చింది రాముడికి.

పురుషులు పరాంగనలతో చేరడానికి తప్పులేదంటూ...స్త్రీలు అలా పరపురుషులతో చేరితే తప్పులుపడతారు — అందేనా?

అంగాలోనూ ఇంతవరకూ అరుణపట్టినక్షనం అనుమానించని రాముం, ఆక్రోశానికిఅంతులేని ఉక్రోషక్రోధంతో నుడిపోయాడు. అరుణవేపు చురచురా చూస్తూ అన్నాడు.

"ఏం? ఇలాచేసిందేం ప్రసన్నా?" అడిగాడు తీవ్రంగా—

'ఇష్టంలేక . . .!" ధీమాగా జవాబిచ్చింది అరుణ.

'ఎందుకు నన్ను పెళ్ళాడావు?"

"భర్త అనేవాడు ఉన్నాడని అనిపించుకోడానికి—!'

ఈక్షణంలో రాముం తోకత్రొక్కిన త్రాచులా లేచాడు. వెంటనే అరుణమీదకు సింహంలా ఉరికాడు. బలంకొలదీ కొడదామని చేయిని ఎత్తాడు రాముం.

ఇంతవరకూ చూస్తూ ఊరుకొన్న మోహన్‌బాబు, అరుణను రక్షిద్దామని అడ్డం వచ్చాడు. ఆమెకు తగలవలసిన దెబ్బ. మోహన్ గూబమీదకి పాకింది అయిదువేళ్ళూ ఫ్రాకీలులా పొంగాయి. మోహన్‌బాబు క్రిందకు తూలిపడ్డాడు బాధతో,

'అబ్బ . . . .!" అంటూ బాధగా గూబలు తడుముకొంటూనే కిందనుండి లేచాడు మోహన్‌బాబు.

ఏమిటో ఆశ్చర్యంగా గదిలో నాలుగువంకలా పిచ్చివాడిలా చూసాడు. ఏమిటేమిటో లోలోపలనే గొణుగుకొన్నాడు.

"ఏమిటండీ! ఏమయింది . . .! ఎందుకాఖంగారు!" అంటూ రాధ ఆదుర్దాగా భర్త దగ్గరకు వచ్చింది.

"ఛీ! ఇన్నాళ్ళు కాపురం చేసానా! పో! ఆ రామంగాడితోనే లేచిపోక ఇక్కడికెందుకొచ్చావు? ఛీ నీ మొహం చూడకూడదు. ఆ రామాన్నే నమ్ముకొని లేచిపో!" అంటూ బాబు రాధమీద ఉగ్రుడై పోయాడు.

రాధ నివ్వెరపోయిం దాతని మాటలను విని. కళ్ళలో అప్రయత్నంగా నీరు వర్షించింది.

'రామం ఎవరు? నాకూ అతనికీ ఏమిటిసంబంధం? లేచిపోవడం ఏమిటి? ఎందుకు లేచిపోవడం. . .'' ఇలా అర్థంగాక మథనపడింది కొంతసేపు రాధ.

'ఆ రామంగాడ్ని ప్రేమించావా లేదా?' పిడుగులాగ అడిగాడు.

ఎవరుచెప్పారు- ఇంతద్రోహంచేస్తానా?'

'ఏం పతివ్రతలా కబుర్లుచెబుతున్నావే! వాడినేప్రేమించు. నా అభ్యంతరంలేదు. నేనిక్కడ ఒక్కనిముషం అయినా ఉండను. ఏనాడైతే నీమార్పుని గుర్తించానో అది నా స్వప్నమే రుజువుచేసింది. అందుకే మనకి సంతానం కలుగటంలేదు, రామంతో సుఖంగా ఉండు''

అంటూ గబగబా అడుగులు వేసికొంటూ వెళ్ళిపోయాడు.

ఎక్కడికి పోదామనో ఆతని ఉద్దేశ్యం?

కొంపతీసి సన్యాసి అవ్వడుకదా?

కల అని మోహనబాబు అనగానే రాధకు రాత్రివచ్చినకల జ్ఞాపకానికివచ్చింది. ఆమెకుగూడా తనభర్తకువచ్చిన స్వప్నమే వచ్చియుంటుందని అప్పటిపరిస్థితులనుబట్టి తెలుసుకొంది.

'మీరేగా నేర్పారు ఈపాఠం! మీరు మీయిష్టంవచ్చిన అరుణతో నాకు తెలియకుండా తోటలో కాలం గడిపితే, నేనుమాత్రం

రాణంకోయుంటే తప్పువచ్చిందా!" అంది మోహనబాబుతో వ్యంగ్యంగా, అతను వెళ్లిపోయే సమయంలో—

మోహనబాబు ఎక్కడికి వెళ్ళిపోయాడో తెలియలేదు. నాటి నేటికి మోహనబాబు రాలేదు.

పాప! మోహనబాబువంటి ఆధునికవిలాసమూర్తులుంటే పాఠకులు నవ్వుకొనకుండా యుండరు. అంతేనంటారా?

---

# 6

రాధ మోహన్‌కోసం చాలా బెంగపెట్టుకుంది. కాని! మోహనబాబు ఎక్కడికిపోయాడో ఎవర్కీ తెలియదు- రాధ రానురాను చాలా చిక్కిపోయింది.

మోహన్ రాజమండ్రివదలి రామచంద్రపురం చేరాడు. అక్కడ కొన్నాళ్ళు గడిపి చివర్కి విజయనగరం చేరాడు. అదిన్నీ చిన్న ఉద్యోగం లభించడంచేత, ఎంతఉద్యోగం చేస్తున్నా కట్టుకున్న భార్యని వదలివచ్చానే అన్న చింతపోలేదు. కొన్నాళ్లు సంసారసుఖాలు అనుభవించినవాడుగాబట్టి అతని శరీరము యౌవ్వన ప్రోద్బలంచేత వశము తప్పినది- విజయనగరము వేశ్యవాటికకు ప్రఖ్యాతిచెందినదన్న విషయము అందరికీ తెలిసిన విషయమే!

సంబంధం ఎలాకలిసిందోగాని, మన మోహనబాబుకున్నూ, మదన మంజరి అనే వేశ్యకును సంపర్కము కలిసింది— ఆకారణంచేత కొన్నాళ్లు మోహనబాబుకు భార్యలేని కొరత తీరింది— కాని—!

ఎన్నాళ్ళని ధనమంతాగుమ్మరించి ఆనందాన్ని పొందగలడు! అతనేమీ ప్రస్తుతస్థితిలో పెద్దజీతగాడు కాదాయెను! పోనీ డబ్బుకు

లభిస్తున్నా వేశ్యలవల్లపొందేది కృత్రిమ ఆనందమని మోహన బాబుకు తెలుసును—

మరి... అవ్వాకావాలి! బువ్వాకావాలి!... ఎలాగ!

తన భార్యను స్వల్పకారణాలచేత విడిచివచ్చిన మూర్ఖత్వానికి చాలా నొచ్చుకున్నాడు—

తిరిగి రాధవద్దకు వెళితే..!

ఛా! లోకువై పోమా! అప్పుడు మరింత నీచంగా చూస్తుంది పెళ్లానికి! అప్పుడు మరింత అవమానం సంపాదించవలసియుంటుంది— ఎంత హోటల్ భోజనం తింటున్నా మోహనబాబుకు ఇంటిమీది ధ్యానం పోలేదు—

తానేలాగయితే భార్యను విడిచివచ్చాడో, అలాగే రాధ కూడా వేరేగత్యంతరం లేక రామంగాడ్ని లేవదీసుకొనిపోయే యుంటుందని నిశ్చయించుకొన్నాడు— ఆ స్థితిలో అరుణను నేను చేరదీస్తే బాగుండదూ! అనే ఉద్దేశ్యం కలిగింది అతనికి—

ఈవిధంగా వివిధ చర్యలతో వికలమైన మనస్సుతో విచారిస్తూ యుండేవాడు మోహనబాబు.

ఆనాడు మదనమంజరికి ముత్యాలహారం బహుమానంగా తెస్తానని వాగ్దానం ఇచ్చాడు.

వాగ్దానం అప్పటి ఆనందంకోసం చేసాడేగాని ముత్యాలహారం కొనడానికి అతనికి తాహతు ఎక్కడిది!

అతనికి సరిగ్గా అప్పటిపరిస్థితులు కాఫీనీళ్లకయినా డబ్బులుండవు— ఎలాబహుమానం అందద్దామనుకొన్నాడోగాని వాగ్దానం మాత్రం చేసాడు మాటకివ్వనని—

నాడు మోహనబాబు భయంతో మదనమంజరి ఇల్లుచేరాడు. తలుపు మెల్లగా తట్టాడు. సుమారు పన్నెండు గంటలు అయివుంటుం

# స్వప్న మంజరి

ది. వీధుల్లో జనసంచారము ఏమీ లేదు. కీచురాళ్ళ రవళి తప్ప మరే ధ్వని వినబడటం లేదు!

మెల్లిగా మదనమంజరి వచ్చి తలుపు తీసింది— మోహన్ బాబు లోపలకు ప్రవేశించాడు.

'మంజరీ......! అంటూ మంచం మీద కూర్చొని ఆప్యాయంగా పిలిచాడు మోహన్!

ఎందుకూ! ముత్యాలహారం తెచ్చావా? అడిగింది మంజరి.

"అరెరె! మరచిపోయానను మా! నిజంగా మరుపువల్ల తేలేదు. రేపు తప్పకుండా తెస్తాగా! అంటూ తడబడుతూ సర్దుకోవాలని చూశాడు—

మంజరిలో మార్పులు వచ్చినట్లు కనిపెట్టాడు మోహన్—

కోపం వచ్చిందా?" అంటూ ఆమెను ప్రక్కలో కూర్చోబెట్టుకోపోయాడు.

మంజరి విదిలించుకొని దూరంగా నిలబడింది మోహం చిట్లించుకొంటూ—

'రేపు అని గోడమీద వ్రాసుకోవాలా!" తీక్షణంగా అడిగింది

ఛా! రేపు తప్పక తెస్తానంటిగా! అంతట్లోకే కోపమైతే ఎలా చెప్పు!...రా...ఇలా!" అంటూ మోహన్ మంజరిని బ్రతిమాలుకో సాగాడు—

మంజరీ! నీకు నామీద స్వచ్ఛమైన ప్రేమ ఉంటే ఇవన్నీ కోరనే కోరవు—కొంచెం వెటకారంగా అన్నాడు మోహన్.

"అవును! డబ్బు వదలందే జబ్బు కుదరదని తెలీదూ! నాకి డబ్బే కావాలి. నా నీ డబ్బుకోసమే ఈ నీచవృత్తి సాగిస్తుంది. అంతే గాని ప్రేమలతో సంబంధం లేదని తెల్సుకో!"

"మంజరీ! నువ్వెంతో పొరబడుతున్నావు నా విషయంలో! రేపు తప్పక తెస్తానంటే [illegible] భాష్యమా."

"ఛీ! ముసుమంచందిగు- ఎన్నాళ్లని మోసం చేయదల్చు కొన్నావు!—

అంటూ మంజరి, మోహనబాబు చేయిపట్టుకొని టకటన మంచంమీదనుంచి ధైర్యంగా లాగివేసింది.

మంజరియొక్క ఈ చర్యలకు మోహన్ ఉగ్రుడై పోయాడు,

"ఛీ! ఇంకాబుద్ధిలేదూ! ఇంకా నిద్దావెందుకూ!" అంటూ కాండ్రించి ఉమ్మేసింది.

"అప్రయోజకుడవు' అని నానికూడా అనగానే అతనికివళ్లు కంపరం ఎత్తింది. ఆఖరుకి భోగందానిచేతకూడా అప్రయోజకుడనని అనిపించుకొన్నానే అనే అవమానంచేత మెల్లగా చేతిం చొక్కా క్రిందకు పోనిచ్చాడు.

ఇంతలో మంజరి అక్కడనుంచి వెళ్లి చప్పుడుచేస్తూ తలుపు తీసింది. ఇద్దరుముగ్గురు కాపోలు, బలాఢ్యులు పోటుగా తయారైవచ్చారు ఆసమయంలో. మంజరి వారిచేతులను పట్టుకొని ఆహ్వానిస్తోంది. మోహన్ ఇదంతా గమనిస్తూనే యున్నాడు ఆవేశంతో.

'వాడేగాబోలు మోహనబాబు! ముత్యాలహారం ఇస్తానని మోసగిస్తున్న మహాత్ముడు!" అన్నారు వెంటనే అందులోవకడు—

"చూడురాజా! పొమ్మంటే పోకుండా బలాత్కరిస్తున్నాడు నన్ను వంటరిగచేసి...!" అంటూ మంజరి లేని ఏడుపును తెప్పించుకొని ఆవిటులలో వకడైనరాజు కౌగిలిలో చేరింది వెక్కి వెక్కి ఏడుస్తూ—

ఆవిటులు ఏమనుకొన్నారోగాని వకరి మొహాలు వకరుచూచుకొని తత్ క్షణమే మోహనబాబుమీదకు ఉరికారు.

మోహనబాబు ఇదికని పెట్టి తప్పించుకొని తనచేతులనివకర్త వాళ్లనిప్పి (ఆసమయంలో) ఇదేసమయమనియెంచి గుప్తంగా బొడ్డులో

దాచియుంచే తళతళమని మెరిసే కత్తిని బయటకుతీసి, మంజరి గుండెల్లో పొడిచాడు వెంటనే—

"బాబోయ్...!' అనే కేకతో మంజరి నేలకొరిగింది.

మోహనబాబు ఆరక్తవస్త్రాలతోనే, తలుపు తీసేయుందిగాబట్టి పలాయనం మంత్రం జపించాడు.

విటులు జరిగినసంగతి తెల్సుకొని పట్టుకోవాలని వెనకాలే పరుగెత్తారు. ఆవిధంగా ముందు మోహనబాబు, వెనక విటులు ఆ అర్థరాత్రిలో చాలాదూరం పరుగెత్తారు. కాని మోహన్ వారికి అందలేదు.

ఈ విటులకి గస్తీతిరిగే పోలీసులు కూడా కనిపిస్తే వారుకూడా మోహనబాబును పట్టుకోవాలని పరుగెత్తారు.

తనని పోలీసులుకూడా వెంబడిస్తున్నారని మోహన్‌కు తెలిసింది. అతని వంటపైన్నా నల్లగిలిపోయాయి. సమూహంచూసిన ఇద్దరు ముగ్గురు పట్టుకోవడానికయి చుట్టుకొని వస్తున్నారు.

అతనికేమీ తోచిందికాదు. ఆయాసం ఎక్కువైంది. ఎక్కడైన తలదాచుకోవాలని నలువంకలా చూసాడు. ఎక్కడా దీపం అనేది కనుపించలేదుగాని, ఒకయింట్లో మాత్రం మినుకుమినుకు మంటూ ఆరిపోవడానికి సిద్ధంగాయున్న చిన్ని ఆముదందీపం కనబడింది.

వెంటనే ఆలోచించక ఆ ఇంటికి పరుగెత్తాడు. తలుపు దబ్ దబ్ మని బాదాడు. లోపలకు దూరాడు. లోపలున్న స్త్రీ అలక్షించక అపాయమని తెల్సుకొని కూడా తలుపు గడియవేసేసింది.

అతని దుస్తులమీద రక్తపుమరకలు కనబడేటప్పటికి, అతనొక హంతకుడని ఆ స్త్రీ గ్రహించింది.

మోహన్ ఆ స్త్రీమూర్తిని పరిశీలించిచూసాడు. ఆమెకూడా తదేకధ్యానంతో చూసింది.

ఒక్కసారి ఇద్దరినేత్రాలలోనూ ఆనందభాష్పాలు రాలినాయి అమాంతంగా "మోహన్...!.... రాధా!..." అంటూ ఇద్దరూ కౌగలించుకొన్నారు ఆనందంతో.

ఆఆనందపుకౌగిలిలో మోహన్ వస్త్రాలకున్న రక్తపుమరకలు రాధ తెల్లచీరకు కూడా అంటుకున్నాయి కాని! ఆమె విషయాన్ని గుర్తించలేదంటే ఆశ్చర్యము ఏముంది!

ఆఆనందపుకౌగిలిలో తన్మయుం చెందుతున్న సమయంలో తలుపులు బద్దలయ్యేటంతటి చప్పుడు అయింది బయట.

ఇద్దరు పోలీసులు వచ్చారని తెల్సుకొన్నాడు. మోహనబాబుని వెంటనే గుప్తంగా చేసిందిరాధ.

మెల్లగా వెళ్ళి, అప్పుడే నిద్రనుండి లేచినదానిలా కళ్ళునులుపు కొంటూ తలుపులు తీసిందిరాధ.

పోలీసులు ఇంటో ప్రవేశించారు. రాధ ఆశ్చర్యపోతున్న దానిలా నటిస్తుంది. వారు ఎవరోఒకవ్యక్తికోసం టార్చిలైటుతో నలు దిక్కులా వెదుకుతున్నారు.

"అలా వెతుకుతున్నారెందుకూ! యెవరున్నారిక్కడ!" అడిగిందిరాధ.

"హంతకుడు ఈఇంటో దూరాడు." అంటూ ఒకపోలీసు తన కరదీపికతో యెదురుగాను ఆమెకేసిచూస్తూ వెదకాడు.

"ఈమెయే హంతకురాలు. అదుగో రక్తపుమరకలు...!" అన్నాడు ఒపోలీసు కసుర్తాగా.

మె గుండె నీరైపోయింది. ఇప్పుడామెకు ఆరక్తపుమరకలు యెలావచ్చాయో అర్థమయింది.

ఏంలాభం!

వాళ్ళు యెలాగైనా ఆమెపై నిందారోపణచేస్తారు. యెలాగైన ఆఅర్ధరాత్రిలో బంధించి తీసుకొని పోతారు.

వారిని తప్పించుకొనేడుపాయం? ! !

ఎన్నో విధాల బ్రతిమాలింది. వారు వినలేదు. ఇదంతా మూలదాగియున్న మోహనబాబు గుర్తించేయున్నాడు.

మోహనబాబుకేవిధ సుహస్థితులవల్ల నతిపోయింది. ఈ ఆపద నుంచి తప్పించమని భగవంతుని ప్రార్థించాడు.

రాధ తాను నిర్దోషినని బ్రతిమాలుకొంటున్నా ఆపోలీసు పెద్ద వలు వినలేదు.

కాని...!

ఆపోలీసులు ఏమనుకొన్నారోగాని మెల్లగా నవ్వుతూ రాధతో ఇలా సంభాషణ మొదలుపెట్టాడు.

'ఇలా చూడు పిల్లా! మేము ఆపదనుంచి నిన్ను తప్పిస్తాము. మాకేం ఇస్తావో చెప్పు!' అని అందులో నకడు మీసం మెలివేస్తూ అన్నాడు.

'మాకేమీ వద్దు, వక్క సారి నీ అధరామృతాన్ని చవిచూడ నియ్యి— —"

అంటూ మరో పోలీసు ఆమెను చేరబోయాడు.

ఫెళ్ మని లెంపకాయి కొట్టింది ఆపోలీసును రాధ. రాధ చేతి రెండు అంచులు వేళ్లూ ఆపోలీసు దవడమీద తాండవించినాయి.

ఆసమయంలో రాధకుకలిగిన ఆగ్రహ్యమునకు మోహనబాబు ఆశ్చర్యపోయ్యాడు.

అది ధైర్యంకాదు. ఆమె నక వీరవనితకేచెప్పాలి. అంతమంది యమభటుల్లాయున్న పోలీసులముందు రాధ అలా ఎదిరించిందంటే ఎంతసాహసంతో చేసిందో చూడండి!

రాధ ఆవిధంగా వారిని అవమానించిందేగాని, ఆ బాధకులు తన్నేమైనా వంటరిగా యున్నానని బలాత్కరిస్తారేమో యని భయ పడింది.

దెబ్బతిన్న పోలీసులుగాక, మిగిలినవారు వెంటనే ఆమెను చేరి పట్టుకొన్నారు.

"ఇంకా తూనా వేరా!" అని అంటుండగానే నరకుడు రాధపై ఉరికాడు మృగంలా.

రాధ వీరి బారినుండి తప్పించుకోవాలని పెనగులాడుతోంది. బలమున్నంతవరకు వాళ్ళను గాయపరచింది. రాను రాను రాధ యొక్క పరిస్థితులు అగమ్యగోచరమయింది.

ఒక్క స్త్రీమూర్తి అదృష్టంతో ధైర్యంగా పోరాడుతోందంటే ఆమె యొక్క సాహసాన్ని ప్రశంసించవలసిందే!

రాధ శరీరంమీద స్పృహ తప్పిపోయింది, నేలకు వాలింది—

అప్పటిదాకా ఏ చేనులోనో గుప్తంగా దాగొన్న మోహనబాబు లేచాడు. ఆ పోలీసుల దరికి వచ్చాడు.

వారు రాధను చంపి చాలని వెళ్ళుతున్నారు- ఏమరపాటుగాయున్నారేమో ఒక్క పిడిగుద్దు గుద్దగానే మోహన్, వారిది ఇనప శరీరము కాబోలు ఒక్కసారిగా తిరుగుబాటుచేసి మోహనబాబుని గాయపరచి అక్కడనుంచి పారిపోయారు పోలీసులు.

మోహనబాబు మూలుగుతూ రాధ దగ్గరకు వచ్చాడు—

"ఏమిటండీ ఆ పలవరింతలేం? లేవండి! తెల్లవారి కావస్తోంది. అప్పుడే...!" అంటూ రాధ మోహనబాబుని లేపింది—

మోహన్ ఉలికిపడి లేచాడు, ఎదురుగా రాధ చిరునవ్వుతో నిలబడియుంది.

ఇంతవరకు జరిగిన కథంతా కలలో అని అప్పుడు తెలుసుకొన్నాడు. తనకి తనమీదనే నమ్మకం పోయినట్లయింది.

"రాధ నా స్వప్నంలో కనబడటం ఏమిటి? ఈమె నా స్వప్నసుందరి అంటూ ప్రేమించటం ఏమిటి! పోని నా రాధ వలపుసుందరి

అనుకొంటే ఎందుకు సంతానమునకల్లగపోవాలి? ఆశోకుంజంలో రాధనన్ను ప్రేమించనంటేనని గిల్లికజ్జా తెచ్చుకొన్నానా? అది గాక మూడిద్దర్కీ స్వప్న విరోధం వచ్చిందా? ఎదురింటి రామయ్యగారితో నా రాణి పికాస్లుగొట్టిందా? ఆ కటిక రాధను వదిలిపెట్టి విజయనగరం చేరానా? ఏమిటీ విషయాలు?

రాజమండ్రినుంచి నా శరీరం విజయనగరం చేరిందా? అసలు ఎక్కడికెళ్లలేదే! ఊc! తరువాత విజయనగరంలో మంజుతో స్నేహం కలవడం, ముత్యాలహారం కోసం కానిచేయడం జరిగిందా? పోలీసులు తరిమిరాగన్నా? రాధ రక్షించిందా?

ఏమిటీ వింతవిషయాలు? అబ్బ...ఏంట్రాజెడీ అయినస్వప్నం రాత్రి—!

ఇలా పై భావాలన్నీ ఒక్కసారి జరిగిన గాధంతా బుర్రలో తిరిగింది...

తాను వ్రాయబోయే నవలకి భలేఅయిన ప్లాటు దొరికిందని సంతోషించాడు- వెంటనే ఆనందంతో రాధను వలిపిపాశేసాడు-

అతని ఆనాటి వింత ఆనందానికి, సంతోషానికి కారణంరాధకు అర్థంగాలేదు.

"మోహనరావుగారూ..! అంటూ పబ్లిషర్ గోవిందయ్య కేకపెట్టాడు వీధిలోంచి—

లేడిపిల్లలా మోహన్ కౌగిలినుండి రాధగెంతువేసి బయట పడింది—

"కూర్చోండి వస్తారు- ఇప్పుడే లేచారు" అంటూ అవచ్చిన పబ్లిషర్ని కూర్చోపెట్టింది.

మోహన్ అప్పటి కప్పుడే కాలకృత్యాలు నిర్వర్తించుకొని సిద్ధ

కాఫీ కప్పుక్రింద పెట్టేసి, ఓ సిగరెట్టు ముట్టించి గోవిందయ్యవున్న స్థలం వద్దకువచ్చి దగ్గరకువచ్చి దగ్గరున్న కుర్చీలో కూర్చొన్నాడు.

"నమస్కారమండి కవిగారూ—"

"నమస్తే మహాశయా!"

"......"

"ఇలా వచ్చారేం ఆదుర్దాగా?" అడిగాడు మోహన్.

"ఇవాళ మెయిలుకు హఠాత్తుగా మద్రాసు వెళ్లవలసివచ్చింది చెప్పిపోదామని వచ్చానండి"

"అలాగా! ఎప్పుడు తిరిగి వస్తారు?

'అదే చెబుదామని వచ్చాను— నెలాఖరుకు తప్పక వస్తాను- మనం అనుకొన్న నవలల విషయం మరచిపోతారేమోనని ఒకసారి జ్ఞాపకం చేదామని వచ్చాను.

'అయ్యో! తిరిగిమీరు రావాలాదీనికోసం? మరచిపోనులెండి! మీరువచ్చేటప్పటికి అనుకొన్న అరడజను నవలలువ్రాసి ఇచ్చేస్తాను- అయిదువ్రాసేయున్నాయి- ఇంకొకటి వ్రాయాలి. అదిన్నీ కొన్ని పేజీలు వ్రాశాను- చూస్తారా? అంటూ రాధను పిలిచాడు.

రాధ అయిదునవలలవ్రాతప్రతులను (మేన్స్క్రిప్ట్స్) తెచ్చింది. అప్పటికా పబ్లిషర్ ముఖం కలువలా వికసించింది.

ఇంకానయం! చంద్రబింబంలా అనవలసింది ముఖాన్ని, కారణం ఏమిటంటే పబ్లిషరుకు యిలాంటి నవలల వ్యాపారంలో అంతా లాభమేగా! కాగా పోగా వ్రాసేవాడికి పాతికో పరకో ఇచ్చి కళ్లనీళ్లు తుడుస్తాడు. ఏంచెప్పమంటారు పబ్లిషర్ల విషయాలు!

ఇప్పుడా ప్రసంగం అనవసరంలెండి.

'మీరు మరచి పోతారనికాదు- కొంచెం జ్ఞాపకం చేస్తున్నాను...! అని నవ్వాడు గోవిందయ్య.

రాధకూడా నవ్వక తప్పిందికాదు.

'అబ్బెబ్బె! ఇప్పుడు అలాంటివి లేవులెండి—

'అంటె, ఒకప్పుడు ఉండేవన్నమాటగా! కలవుమరి—

వెళ్ళొదురుగాసలెండి, రాధా! ఒకప్పుకాఫీ తెచ్చిఇవ్వు—
అన్నాడు రాధతో మోహన్

రాధ తెచ్చిన కాఫీతాగి గోవిందయ్య సంతోషంతో ఇద్దరికీ
నమస్కరించి వెళ్లిపోయాడు.

తిరిగి టపీమని రాధనుకౌగలించుకొని—

'రాధా! నువ్వు నా స్వప్నసుందరివి అయినందుకు నాజన్మంతా
తరింపచేశావు. నీవల్ల నేగదానా (స్త్రీ)ంగరల్) అనే నవలకి భరతమయిన
ప్లాటుదొరికింది. అబ్బ! స్వప్నంలో జరిగిన విధాన నిన్నువదలిపెట్టి
వెళ్లిపోగలనా? అన్నాడు ముద్దిడుతూ మోహన్.

'ఏమో బాబూ! ఈగరల్ లాంటిపిల్లవే ఇంకెవరైనా అవుపిస్తె
మదనమంజరి నవలలో చిక్కినట్లు చిక్కిపోతారేమో!

అబ్బె! అసలు మగవాళ్లను నమ్మకూడదు. అందులోగా దేవ
తలో విలపించిందా స్త్రీ!

అందులోనూ మీవంటి కవులను, కళాప్రియులను అసలే
నమ్మకూడదు! అంది అతని కౌగలిలోంచి అర్ధానిమీలిత నేత్రా
లతో—

"ఊహూ! అలాగా రాధా? ఈసంగతి నీకెవరు చెప్పారు. మాక
విత్వంలో స్త్రీని ఎంతైనా పొగుడుతాము.

ఎంత నీచంగా అయినా చూస్తాము కదూ.

అర్ధనిమిషంలో తుర్రుమని పిట్టలారాధ అతనికౌగలిలోంచి
జారిపోయింది.

పట్టుకుందామని మోహనబాబు వెంటాడాడు—రాండు టేబిల్
చుట్టూ తిప్పింది— ఒకళ్ళకొకరు దొరకలేదు—

"పదవోయ్ [illegible]

ప్రేమికుడా, పదవోయి!

అంటూ ఒకచోట నిలబడికోయిల కంఠలా శ్రావ్యంగా పాడింది రాధ.

'రాధా! రాధా!

ఘన దేవలవులగాథా

బాధలు కోరకా— ఆరాధనలు!

'వదనే, రాధికా—"

'అంటూ మోహన్—'

ఈ— రాధా—!

'రాధా—

ఈ- బాధా—'

'అలాగా—!

'అవునే—!

'అయితే సరే—!

"ఊఁ! ఊఁ!...

"రాధా! రాధా!

ప్యారీ రాధా!"

అంటూ రాధను పట్టుకొన్నాడు మోహన్.

ఆవిధంగా ఆ ప్రేమైకపుజీలామైకంలో ఎంతసేవున్నారో తెలియదుగాని, వీధి తలుపులు చప్పుడయింది.

ఇద్దరూ ఆదుర్దాగా లేచారు.

"రాధా! ఎవరు వచ్చారో పోయిచూసిరా! వెధవలునమయానీకే వస్తారు' అంటూ మోహన్ బాబు విసుక్కొంటూ అన్నాడు.

'ఒకవేళ మీస్వప్నంలోని మదనమంజరి వచ్చిందేమో!

"అలాంటి అదదయ్యోగేమన్నా వస్తే లేకా చెప్పకంపెయ్యి!

"వస్తాలెండి!" అంటూ నవ్వుతూ చీరసర్దుకొంటూ వెళ్ళింది రాధ.

ఉత్తరాలండి! అంటూ పోస్టుబంట్రోతు రెండు కవర్లు ఇచ్చి సలామ్ చేసి వెళ్ళిపోయాడు.

అబ్బ; ఎవరూ లేదు, పోస్టువచ్చిందని. ఇదిగో ఉత్తరాలు! అంటూ మోహనబాబుకు రెండుకవర్లు చూసేటప్పటికి ఆశ్చర్యం వేసింది. ఒక్కసారి రాధ మొహంలోకి చూసాడు-

ఏమిటి మోహాన్! ఒక్కసారి అడిగిందిలేనిదానిలా అకరిచే తిలోని కాగితాన్ని చూసి—

"వం—ద—రూ— పాయ—లు!" అంటూ కవరులోని వంద రూపాయలనోటుని రాధకు అందిచ్చాడు.

ఇదేమిటి! కవర్లోనోటు పెట్టి పంపారు. ఆశ్చర్యంగానే వుందే,

రాధా! అదొక్కటేగాదు, ఉత్తరంకూడాయుంది. చదువుతా విను! అంటూ వందరూపాయలనోటుతో వచ్చిన ఉత్తరాన్ని రాధకు ఇలా చదివి వినిపించాడు.

"ప్రియమైన—గారికి—

"నమస్తే- మహాశయ!

ఈనా అల్పబుద్ధితోనూ, అమాయకత్వంతోనూ వ్రాసినలేఖకు—నాసాహసానికి క్షమాపణముందే కోరుతూయున్నాను,

ప్రియా, ఈనాగులాబీ శరీరంలోపొంగి ప్రవహించే యౌవ్వన రక్తంలో, చిలికే అమృతంకోసం అనేక ప్రయత్నించి, విసిగి వేసారి పోయాయి.

విభ్రమరానికి నాప్రేమామృతం అందివ్వలేదు, అర్హతకూడా లేదు!

కాని— —

ఏంతో మీనామస్మరణమే నాయౌవన హృదయానికి మలయ మారుతాల్లా—జీవితకుసుమల్లా—ఆకర్షించినాయ్. ఆశ్వాసించినాయ్. మహాశయా— ఈనా శరీరాన్ని అన్యుల సేవకి అర్పించదలుచుకో లేను. ఈనాగులాబీ పూవులోని పరిమళాన్ని ఆఘ్రాణించి తన్మయం బొందేవరిగా మీరు, నాదృక్పథంలో మీరొక్కరే యున్నారు.

ఎంతధనమూ—

ఎంత యౌవనము....

ఎంతహోదాయుంటేమాత్రం ఏంలాభం!

ధనమున్నందుకు స్త్రీయోగం యుండాలిగాదా!

యౌవనమున్నందుకు వలపుపువ్వులుపూస్తూ, ఆనందపువంట పండాలిగదా!

హోదాయున్నందుకు పరిస్థితులు అనుకూలించాలిగదా!

కాదంటారా స్వామీ!

ఈనా కోర్కెను అగ్రహించినా—అనుగ్రహించినా—ఏం చేసినా ఇష్టమే!

కాని! అనుగ్రహించి నన్నానందింపజేసి జీవితం తరింపజేయమని ఈదీనురాలి కడసారి ప్రార్థన.

లేదా—

పైలోకంలోనైనా మీ వెంటాడి కల్యాణమౌనను. దీంతో పంపిన స్వల్పబహుమానాన్ని అన్యథాతలంచక స్వీకరిస్తారుగదూ!

వీటంటే కల్పుకోండి.

ప్రస్తుతానికి శలవ్—"

ఇట్లు
మీవిధేయురాలు,
శ్రీమతి —— ——దేవి
[కేరాఫ్] —— —— గారు
రాజమండ్రి

మోహనబాబూ! స్టయిఫండ్ ధర్మమాయని స్కూలుఫైన వరకు చదివి ప్యాసయ్యాడు.

ఇక అక్కణ్ణుంచి పెళ్లి అనే సమస్యచేత చదువు ఆగిపోయింది. ఇంతవరకూ పెళ్ళిలేదు. పెడాకులూ లేవు.

స్వార్థపరులైన, సంసారులంతా పట్టి ప్రగల్భాలు పలుకడమే గాని, క్రియకువస్తే శూన్యమే!

ఈవిషయము మీ పేదపెళ్ళి అనేనవలయందు బాగావిమర్శించి నాహృదయాన్ని రంజింపచేశారుగాబట్టే పేదపెళ్లిలోని కథానాయిక నిర్మల జీవితంలోని చీకటిముసుగును వెన్నెలహస్తాలచే వేరుచేసినట్లు నాజీవితాన్ని మంచిగ్రంథాలోనికి తీసుకొనివచ్చి నన్ను తరింపచేస్తారని నాఆశ—ఇక సెలవు!

ఇట్లు మీచరణదాసి [సం] వనమాల—
Co నారాయణమూర్తిగారు
హెడ్ మాష్టరు, ఇన్నీసుపేట,
రాజమండ్రి

అంటూ ఉత్తరం చదవడం పూర్తిచేశాడు మోహనబాబు—

మోహనబాబు తనుపెట్టిన 'మణిహారం' అనేమాసపత్రికలో న్యాయదృష్టితో జరిగే అవినీతికార్యాలు నిష్పక్షపాతంగా విమర్శిస్తు వ్రాసేటే అతని పె సింహస్వప్నంలా యుంది కొంతమంది రాజమండ్రి నివాసులకు.

అవిధంగానే ప్రేమైకజీవులైన మనకవికుమారు మోహనరాధలను, వనమాలాగిరిలను చూసి కొంతమంది కళ్లుకుట్టాయి.

ఇదంతా స్వార్థపూరితమైన లోకం గదండీ!

---

శ్రీనివాసాప్రెస్, రాజమండ్రి ఇ. జి. సర మార్చి 1946— కా 1000

| | | |
|---|---|---|
| సాని - సంసారి | రు | 1 |
| సాయిబాబా | „ | 1 |
| నవభారత్ (లేక) మోడరన్ ఇండియా | „ | 1 |
| దేశదాసు (లేక) సుదినం | „ | 1 [illegible] |
| కాలేజిగరల్ | „ | 1 [illegible] |
| లేడీ డాక్టర్ | „ | 1 [illegible] |
| రంగూన్ రౌడి | „ | 1 [illegible] |
| ధరణికోట | „ | 1 [illegible] |
| ప్రేమ కుమారి | „ | 1 [illegible] |
| రేవతి | „ | 1 4 |
| మేనరికం | „ | 1 0 |
| డాక్టర్ | „ | 1 0 |
| తెలుగు తల్లి | | 1 8 |

---

వలయువారు:—

యస్. అప్పలస్వామి అండ్ సన్సు

పబ్లిషర్సు :: రాజమండ్రి.